Regd. No. H.N.L. 18

18.6.1993 శుక్రవారం 12 పేజీలు, సంపుటి: 64 సంచిక: 24, విడిప్రతి: రూ. 2.00లు

# జమీన్‌రైతు

స్థాపకుడు: నెల్లూరు వెంకట్రామానాయుడు

## సెక్యూరిటీ పాసే పివి కొంప ముంచిందా?

ప్రధాని శ్రీ పి.వి. నరసింహా రావు పై అంత బహిరంగంగా ఆరోపణ చేయడానికి హర్షద్ మెహతాకు ధైర్యం ఎక్కడి నుంచి వచ్చిందన్నది పరిశీలకులకు అంతు చిక్కని మిస్టరీగా వుంది. బ్యాంకు నిధులు భోంచేసి, పీకల వరకు కోర్టు కేసుల్లో చిక్కుకుని వున్న ఒక క్రిమినలు ప్రధాన మంత్రి పైన నింద వేశాడంటే అతడికి ఏదో తెలియని ఆసరా వుండి వుండాలి. అది రాజకీయంగా పివి ప్రత్యర్థులు అందించే పరోక్ష మద్దతు కావచ్చు ; లేదా ఏదో ఒక అంతర్జాతీయ ముఠా తెరవెనుక నుంచి చేయి అందించడం కావచ్చు. ఎంతటి బలీయమైన శక్తి అంతగా నిర్భయా ప్రధాన మంత్రి పైన ఆధారం లేని ఆరోపణలు చేస్తే ఆ పరిణామాలు తట్టుకునేందుకు ఎంతటి వారికీ శక్తి చాలదు. ఆ ఆధారం ఏమై వుంటుందన్నది ప్రశ్న. జోరుగా ప్రచారంలో వున్న పుకార్లను బట్టి 1991 నవంబరు 4 తేది పిఎం సెక్యూరిటీ సిబ్బంది ఇచ్చిన సెక్యూరిటీ పాస్ హర్షద్ మెహతా ధైర్యానికి కారణంగా తెలుస్తోంది. ఆ సెక్యూరిటీ పాస్, హర్షద్ మెహతా ప్రధానిని

కొరవ 12 పేజీలో

# ప్రధాన మంత్రిత్వానికి కోట్ల గాలం?

### పివి పదవీ పరిత్యాగం ఖాయమని తేలడంతో ఆయన లాబీని తన వైపుకు తిప్పుకోవడానికి ప్రయత్నిస్తున్నారు.

మన ముఖ్యమంత్రి శ్రీ కోట్ల విజయభాస్కర రెడ్డి 'తాతపోతే బొంత నాది' అన్న ధోరణిలో ఢిల్లీలో మకాం పెట్టి వున్నారు. ప్రధాన మంత్రి శ్రీ పివి నరసింహా రావు పదవికి ఏర్పడిన ముప్పు ఆయనలో పదవీ పరిష్వంగనా వాంఛను రగిలిస్తున్నది. కోట్ల వారిలో చాలా కాలం నుంచే ప్రధాన మంత్రి కావాలనే ఆకాంక్ష వున్నదట. పిలిస్తే పలికే మనిషి లేని పివికి దక్కగాలేనిది, తనెనెందుకు ఆ పదవీ కాంత వరించకూడదన్నది ఆయన వాదం. ఇప్పుడు పివి నరసింహా రావు గారు పదవీ పరిత్యాగం చేయడం ఖాయమని తేలిపోతున్నది కాబట్టి, అవకాశాన్ని అంది పుచ్చుకోవాలని ప్రయత్నమారంభించాడు. ఎవరు అధికారంలోకి వచ్చినా మెహతా చేసిన అవినీతి ఆరోపణ ఆధారంగా పివిని వేధించడం ఖాయమని, జెపిసి వంటి విచారణ సంస్థలలో ఆయన్ను ఇబ్బంది పెట్టడం తథ్యమని, తనకు అవకాశమిస్తే పూర్తి రక్షణ కల్పిస్తానని విజయభాస్కర రెడ్డి పివి అనుచరులందరికీ చెప్తున్నట్లు వినికిడి.

ఢిల్లీలో ప్రస్తుతమున్న పరిస్థితులలో ఆంధ్ర ఎమ్పీలదే మెజారిటీ! మరే రాష్ట్రం నుంచీ ఇంత మంది ఎమ్పీలు ఐక్యతగా లేరు. కర్నాటక, మహారాష్ట్రల నుంచి కూడా పెద్ద సంఖ్యలో కాంగ్రెస్ ఎమ్పీలు ఎన్నికైనప్పటికీ, స్థానిక రాజకీయాల వల్ల వారు వివిధ గ్రూపులకు అనుబంధితులై వున్నారు. ఆంధ్రలో ప్రస్తుతానికి కోట్ల, వైఎస్ చెలిమి వల్ల, జనార్ధన రెడ్డి సైతం రాష్ట్ర రాజకీయాలలో కోట్లనే సమర్థిస్తూ వస్తున్నందువల్ల ఎమ్పీలలో దాదాపు ఐకమత్యం వుంది. ఒక్క చెన్నారెడ్డి-వాన్ను దొరికితే తనను మించిన


పివి పాలిట యమదూత హర్షద్‌మెహతా

అర్హులెవరున్నారని పంచె ఎగ్గట్టి ఢిల్లీకి చేరడం తథ్యమే అయినా ఆంధ్రలో ఆయన్ను అనుసరించి వెళ్లే పార్లమెంట్ సభ్యులు చెప్పుకో దగ్గ సంఖ్యలో లేరు. పివి పట్ల విధేయత కలిగి వుండడంతో పాటు, అత్యధిక ఎమ్పీల కూటమి నాయకుడిగా ఢిల్లీలో విజయభాస్కర రెడ్డి గారు, పవర్ గేమ్ ప్రారంభించారు.

ప్రధాని పదవికి ప్రధాన పోటీదారులైన శరద్ పవార్, అర్జున్ సింగ్‌లు వివిధ కారణాలతో బలహీనులు కావడం కోట్ల ఆశకు ఒక ఆధారం. శరద్ పవార్ పై ఎన్నికల కేసు వుంది. ఆయన పార్లమెంట్‌కు హాజరు కారాదన్న నిషేధం వుంది. పార్లమెంట్‌కు వెళ్లడానికే ఆంక్షలున్న నాయకుడు పార్లమెంట్‌లో ప్రభుత్వ నేతగా ఎంపిక కావడం హాస్యాస్పదం. ఆ సాకు చూపించి శరద్ పవార్‌ను పోటీ నుంచి తప్పిస్తారనే ప్రచారం వుంది. ఇక అర్జున్ సింగ్‌కు అనుకూలుర కంటే ప్రతికూలుర సంఖ్య ఎక్కువ. స్వరాష్ట్రం నుంచే మాధవరావు సింధియా వంటి వారు ఆయన ఉన్నతికి అవరోధాలు కల్పిస్తారు. బిజెపి కూడా ఆయనకు వ్యతిరేకం. మైనారిటీలో వున్న కాంగ్రెస్ పార్టీకి బిజెపి, సిపిఎం ఫ్రంట్‌ల మద్దతు అవసరం. పివి ఇంతకాలం ప్రభుత్వాన్ని నడిపిందే ఈ రెండు పడవల పై కాళ్లు పెట్టి! వీరికి అవసరమైనప్పుడు వీరు, వారికి అవసరమైనప్పుడు వారు పివిని సమర్థించి, కాపాడే వారు. అర్జున్ సింగ్ నాయకత్వానికి బిజెపి ససేమిరా అంగీకరించదు. అసమ్మతి వాదిగా ముద్రపడిన ఆయన్ను పివి అనుచర వర్గం సైతం పట్టించుకోబోదు. ఇక

కొరవ 12 పేజీలో

# మంత్రిత్వాలలో ఉభయుల కీచులాట!

జాబితా తన కివ్వాలని
పివి పట్టుదల
సీనియర్‌నైన తనను
కించపరచడమేనని
కోట్ల వారి కినుక

రాష్ట్ర మంత్రి వర్గ విస్తరణకు ప్రధాని పి.వి. నరసింహా రావు బ్రేకు వేస్తున్నారు. ముఖ్యమంత్రి కోట్ల విజయభాస్కర రెడ్డి విక్రమార్కుడిలా ఎన్నిసార్లు ఢిల్లీ చుట్టూ ప్రదక్షిణాలు చేసినా ఇంతవరకు గ్రీన్ సిగ్నల్ లభించలేదు. మంత్రి వర్గ విస్తరణలో తనకు ఫ్రీ హ్యాండ్ కావాలని ముఖ్యమంత్రి కోరుతున్నారు. అయితే ప్రధాన మంత్రికి అది నచ్చటం లేదు. మంత్రి వర్గం మార్పులు – చేర్పుల పై తనకు జాబితా ఇవ్వాల్సిందిగా పి.వి. అడుగుతున్నారట. కోట్ల వారు మాత్రం జాబితా సమర్పించేందుకుససేమిరా అంగీకరించక పోవటంతో మంత్రివర్గ విస్తరణలో ప్రతిష్ఠంభన ఏర్పడింది. ముఖ్యమంత్రి ఇటీవలి ఢిల్లీ పర్యటనలో మంత్రి వర్గ విస్తరణ విషయాన్ని మరోసారి పి.వి. దగ్గర కదిపారట. దానికి పి.వి. అంతగా ఆసక్తి చూపకుండా ఎప్పటి లాగానే మార్పులు చేర్పుల జాబితాను పట్టుక రమ్మన్నారట. పనిలో పనిగా ఉప ముఖ్యమంత్రి పదవికి తగిన వ్యక్తిని చూసుకోవాల్సిందిగా పి.వి. సలహా ఇచ్చారట. ఉప ముఖ్యమంత్రి పదవి పట్ల కోట్ల విముఖంగా వున్నారు. పొరుగు రాష్ట్రమైన కర్నాటకలో ఉపముఖ్యమంత్రి అసమ్మతి నాయకుడై అక్కడి ముఖ్యమంత్రి పై తిరుగుబాటు బావుటా ఎగరేసిన విషయాన్ని కోట్ల వారు తన సన్నిహితుల వద్ద ప్రస్తావిస్తున్నారట. తన వంటి సీనియర్‌కు ఉప ముఖ్యమంత్రి సహాయం అక్కరలేదని కోట్ల వివరయాసిగి వచ్చారట. అయితే పి.వి. కోరిన మేరకు జాబితాను సమర్పించేందుకు కోట్ల సిద్ధపడుతున్నారట. సమ్మతి అసమ్మతి అనకుండా సాధ్యమైనంతలో అన్ని వర్గాల్ని కలుపుక పోయే విధంగా జాబితాను రూపొందించే పనిలో ముఖ్యమంత్రి నిమగ్నమై వున్నారు.

ఇలా వుండగా త్వరలో జరుగనున్న మంత్రి వర్గ విస్తరణలో అసమ్మతీయులకు కూడా స్థానం కల్పిస్తామని ముఖ్యమంత్రి ప్రకటించారు. నేదురుమల్లి జనార్దన రెడ్డి ముఖ్యమంత్రిగా వున్నప్పుడు అసమ్మతీయులుగా ముద్ర పడ్డవారు ప్రస్తుతం తనతో సఖ్యంగా వుంటున్నారని, అందువల్ల మంత్రివర్గంలో వారిని కూడా చేర్చుకుంటామని ముఖ్యమంత్రి అంటున్నారు. ముఖ్యమంత్రి ప్రకటన అసమ్మతీయులకు ఊరట కలిగించినా ప్రస్తుత మంత్రివర్గంలో పాత ముద్ర వున్న వారికి మాత్రం ఆందోళన కలిగిస్తోంది.

## అసమ్మతికీ అడిగినన్ని పదవులు?

ఈ నేపథ్యంలో డాక్టర్ వైఎస్ రాజశేఖరరెడ్డి 14 తేది ఉదయం ముఖ్యమంత్రిని కలిసి ఐదు పేర్లున్న జాబితా సమర్పించారు. అసమ్మతి పక్షాన డిఎల్ రవీంద్రారెడ్డి, శ్రీమతి లక్ష్మీదేవి, సంగీతం వెంకటరెడ్డి, డాక్టర్ శివరామ కృష్ణారావు, కందుల నాగార్జునరెడ్డిలకు పదవులివ్వాలని వైఎస్ కోరారు. కడప జిల్లా విషయంలో ఇద్దరి మధ్య చాలా సేపు చర్చ జరిగింది. హోంమంత్రి డాక్టర్ మైసూరారెడ్డిని పదవినుంచి తప్పించడమో లేదా హోంమంత్రిత్వం పీకివేయడమో చేయాలని వైఎస్ పట్టు బట్టారు. హోంమంత్రిని తప్పిస్తే కడప జిల్లా నుంచి తాము మరెవరినీ మంత్రిగా పెట్టాలని అడగబోమని కూడా వైఎస్ చెప్పారట. అయితే ముఖ్యమంత్రి మాత్రం ఎటూ తేల్చి చెప్పకుండా దాటవేశారు.

కడప జిల్లా తప్ప తక్కిన

కొరవ 12 పేజీలో

# జమీన్‌రైతు

## పివి మెడకు ఉచ్చు

పివి పెద్ద చిక్కుల్లో పడిపోయారు. హర్షద్ మెహతా వన్నిన ఉచ్చులో చిక్కుక పోయారు. ఒక ప్రధాన మంత్రికి నేరుగా లంచం ఇచ్చానని ప్రెస్ కాన్ఫరెన్స్ పెట్టి మరీ ఒక నేరస్తుడు ప్రకటించడం భారత చరిత్రలో ఎప్పుడూ జరగలేదు. ఇందిరా గాంధీ పై ఎన్నో అవినీతి ఆరోపణలు వచ్చాయి; కాని ఎవరూ ఆమెకు ప్రత్యక్షంగా డబ్బు ఇచ్చినట్లు చెప్పలేదు; ఏ ప్రతిపక్షం కూడా ఆమె ఫలానా వారి నుంచి ధనం స్వీకరించిందని ఆరోపించలేదు. బోఫోర్స్ కేసులో రాజీవ్ ప్రభుత్వం అపనిందల పాలైందే తప్ప, రాజీవ్ గాంధీకి డబ్బు ముట్టిందని అనడానికి ఎవరూ సాహసించలేదు. కాని పివి నరసింహా రావు గారు ఆ బురద తన పైన చల్లు కున్నారు. నంద్యాల ఉప ఎన్నిక ఖర్చు కోసం 1991 నవంబరు 4 తేది ప్రధాన మంత్రికి స్వయంగా నగదున్న సూట్‌కేసు అందజేశానని హర్షద్ మెహతా ప్రకటించారు. ఆ సంఘటన పూర్వాపరాలన్నింటిని వివరిస్తూ జాయింట్ పార్లమెంటరీ కమిటీకి లిఖిత పూర్వకంగా అఫిడవిట్ దాఖలు చేశాడు. ఆ కమిటీలోని కొందరు సభ్యులూ తన నుంచి డబ్బు తీసుకున్నారని చెప్తున్నాడు.

హర్షద్ మెహతా సామాన్యుడు కాదు. 4 వేల కోట్ల రూపాయల బ్యాంకుల ధనాన్ని భోంచేసిన బకాసురులలో అగ్రగణ్యుడు. చిల్లి గవ్వకు కొరగాని చెత్త కంపెనీల షేర్ల ధరలను వందలు, వేలు రూపాయలకు కృత్రిమంగా పెంచి, ప్రజలలో దురాశను పెంచి, మొత్తం షేర్ మార్కెట్‌నే తల్లక్రిందులు చేసిన ఘనుడతడు. అతడి పై సిబిఐ దర్యాప్తు జరిగింది; జెపిసి విచారణ జరుగుతున్నది; 4 వేల కోట్ల రూపాయల మేరా బ్యాంకుల ధనం గల్లంతైంది. ఈ నేరాలు రుజువైతే అతడికి యావజ్జీవిత ఖైదు పడడం ఖాయం. అటువంటి క్రిమినల్ సాక్షాత్తు దేశ ప్రధాని పైన లంచం ఆరోపణ చేయగల్గడంటే దాని వెనుక ఏదో పెద్ద రాజకీయ కుట్ర వుండాలి. జిత్తులు మారి గుంట నక్కగా, డబ్బు కోసం దేశ ద్రోహాల కేసులు వాదించడానికి కూడా సిద్ధమయ్యే వాడిగా పేరుపొందిన ప్రసిద్ధ న్యాయవాది రామ్‌జెత్మలాని హర్షద్ మెహతా ప్రక్కన వున్నాడు. అతడ్ని డిఫెన్స్‌లో వుంచితే శిక్ష తప్పదు కాబట్టి, అప్రూవర్‌గా మార్చి శిక్ష తప్పించడానికి జెత్మలాని లిటిగెంట్ బ్రెయిన్ పన్నిన పన్నాగమైనా అయివుండాలి; లేదా పివిని భ్రష్టు పట్టించి, గద్దె దించి, రాజకీయ అస్థిరత్వం కల్పించడానికి అంతకంటే పెద్ద స్థాయిలో కుట్ర ఏదైనా జరిగి వుండాలి.

ఏది ఏమైనా భారత ప్రధాన మంత్రి ప్రతిష్ట మంట గలిసి పోయింది; ఆరోపణలకు, అపనిందలకు, అనుమానాలకు దూరంగా వుండవలసిన అత్యున్నత అధికార పీఠం పై బురద పడింది; మచ్చ ఏర్పడింది. కోర్టులో కేసులున్న ఒక నేరస్తుడు చెప్పే మాటలకు విలువే ముందని ఈ సంఘటనను తేల్చి పారేయ జూడడం పివికి మంచిది కాదు; దేశం పరువుకు అసలే తగదు. ఈ ఆరోపణలో నిజం లేదని ప్రజలకు సాక్ష్యాధారాలతో సహా నిరూపించ వలసిన బాధ్యత పివి పై వున్నది. ఆ సచ్ఛీలత రుజావు చేసుకునేంత వరకు పివి ప్రధానిగా పదవిలో కొనసాగడం ఎంత వరకు ధర్మసమ్మతమో ఆలోచించాలి. స్కాంలో ఇరుక్కున్న ఒక కంపెనీ షేర్లను తన స్వంత డబ్బుతో కొన్నాడన్న నెపంతో చిదంబరంను మంత్రి పదవి నుంచి తప్పించిన పివి, తాను మాత్రం పదవి కాపాడుకో జూడడం ధర్మ సమ్మతం కాదు. ప్రధాన మంత్రే అవినీతి ఆరోపణలకు గురై పదవిలో కొనసాగితే ఇక మంత్రులు, ముఖ్యమంత్రులు, అధికార యంత్రాంగాన్ని ప్రశ్నించే నైతిక హక్కు ఆయనకు వుంటుందా? ఇప్పటికే మన రాజకీయ, అధికార వ్యవస్థలు అవినీతితో కుళ్లి పోయి వున్నాయి. ఇప్పుడిక వాటికి కళ్లెం వేసే వాడే వుండడు. పార్టీలో ఎంతటి మెజారిటీ వున్నప్పటికీ పివి తన పదవికి రాజీనామా చేసి తన సత్య సంధతను రుజావు చేసుకోవ డానికి దర్యాప్తు సంస్థలతో సహకరించడం అవసరం. ప్రధాని పదవిలో కొన సాగుతుండే నాయకుడి పై సిబిఐ గాని మరొక సంస్థ కాని నిష్పాక్షికంగా విచారణ జరుపుతుందని ప్రజలు విశ్వసించలేరు. భారత రాజకీయాలలో నైతిక ప్రమాణాలు, విలువలు ఇంకా అంతరించి పోలేదని ప్రపంచానికి చాటి చెప్పడం కోసమైనా పివి తన పదవిని త్యాగం చేయడం సముచితం.

ఇంకొక ప్రక్క దేశాధినేత పైన ఆరోపణ చేసే ధైర్యం హర్షద్ మెహతాకు ఎక్కడి నుంచి వచ్చిందో, దీని వెనుక ఎవరు వున్నారో ఆరా తీయడం అవసరం. కొన్ని వేల కోట్ల రూపాయలు దిగమింగిన నేరస్తుడు అట్లా మాట్లాడడం సామాన్యమైన విషయం కాదు. ఇంత పెద్ద నేరానికి పాల్పడిన వ్యక్తిని బాహాటంగా బయట తిరగనిస్తున్న మన భారతీయ శిక్షా స్మృతి పైనే ప్రజలలో నమ్మకం పోతున్నది. జేబు దొంగను నెలల తరబడి జైళ్లలో వుంచే దేశంలో, చిల్లర నేరస్తులను లాకప్ డెత్‌లకు గురిచేసే రోజులలో హర్షద్ మెహతాలు తాజ్ హోటళ్లలో విలాస జీవితం గడపడానికి అనుమతించడం, అతడి నుంచి సమాచారం రాబట్టడానికి సిబిఐ, జెపిసిలూ నిస్సహాయత వ్యక్తం చేయడం దారుణం. ఇంత దూరం వచ్చిన తర్వాతైనా ప్రభుత్వం, సిబిఐ, జెపిసి వంటి సంస్థలు కఠినంగా వ్యవహరించి, తమ సమర్థతను నిరూపించి, స్కాంలో మెహతాలు దోచుకున్న 4 వేల కోట్లు ఎక్కడున్నాయో వెలికి తీయడం, దోషులను శిక్షించడం జరగాలి.

## 50 ఏళ్ళ క్రితం ఈ వారం

**జమీన్‌రైతు**

18.6.1943

4 పేజీలు, అణా:

### త్యాగశీలి

**శ్రీ తూములూరి అనంత పద్మనాభయ్య గారు**

చావు బ్రతుకుల్లో వున్నారు. వదాన్య శేఖరులు చేయిచ్చి లేవదీయండి.

వీరిని గురించి ఎరుగని వారు ఈ నెల్లూరు జిల్లాలో గాని, ఆంధ్ర రాష్ట్రము నందు మరెచ్చట గాని ఎవరును ఉండరు – నెల్లూరు టవున్‌లోని వీరి సేవ. సకల పత్రికలను వేకువన 5 గంటల లోపల ఎప్పుడు చదువునో, చదివి సర్వ విషయముల సారాంశమును, ముఖ్యముగా ప్రభుత్వ లోపములను, కాంగ్రెస్ బలమును వివరించి గోడ మీద ఉదయములోపల సకల జనులు చదువుకొనుటకు వీలుకలుగునట్లు వ్రాసి యుంచెడి వారు. వీరు ప్రారంభించిన ఈ విధమైన ప్రచారము ఇప్పటికీ తిప్పరాజు సత్రం వద్ద జరుగుచూనే యున్నది.

**జబ్బు**

వీరికి దేహము నందు జబ్బు కలిగి నరములలో ఏదో చెప్పలేని ఒక బాధ వలన 4,5 సంవత్సరములుగా వెలుపలి సంచారము లేక తన బసయందే ఇంటికి వాకిట తిరుగుటను మించి ఏ పని చేయలేక యుండిరి – వీరు తమ యావదాస్తిని, మంచి వేతనము నిచ్చుచుండిన సర్కారుద్యోగమును దేశ సేవా తత్పరులై ఇష్టముతో గోలుపోయిరి.

**నేటి స్థితి**

వీరి ప్రకృతము, వీరికి జబ్బు జాస్తి చేసినది. 15, 20 దినములుగా పూర్తిగా శక్తి తగ్గిపోవుచు వచ్చినది. బలహీనత ఎక్కువ కాజొచ్చినది. ఇన్ని సంవత్సరముల కాలములోను తన జబ్బునకు తృప్తి కరమైన చికిత్స చేసుకొనుటకు ద్రవ్య వసతి లేక ఒకరి నాశ్రయించి చేసికొనుట కిష్టగించు ప్రకృతి గాక పోవుట వలన ఊరక అట్లట్లుగా జరిపి వేసిరి.

**తక్షణ చికిత్స**

ఇప్పుడు వారి స్థితిని గమనించి వీలైన వైద్యమును చేయించుటకై ప్రయత్నించు చున్నాము.

**సహాయమవసరం**

కావున వారి విషయమై యెవరైనను యెట్టి సహాయమైనను చేయవలెనని కోరుచు వారి వారి విరాళములను నాకు అందజేయుదురని వేడుచున్నాను. ఈ దినమే వారిని ఆసుపత్రికి చేర్చినాము.

విరాళములను గురించిన వివరములను ముందు ప్రచురింప బడును.

కొమండూరు పార్థసారధి అయ్యంగార్
కౌశికాశ్రమము

### నెల్లూరు ముచ్చట్లు

**స్టాండర్డు గుడ్డ**

గుడ్డ యింకా రాలేదు. ఎప్పుడు వచ్చేది గూడ తెలియదు. వచ్చినా అది నెల్లూరు టవున్ మట్టుకైనట తల 1 కి 50 గజాలు వంతున లెక్క వేశారు. ఇప్పటికి అన్ని రకాలు కలిపి 5000 x 50 = 27,000 గజాలు వస్తుంది కాబోలు. జిల్లాలో 15 లక్షల జనాభా గతి ఏమి? మానభంగమై పోతున్నదే యింకా యెప్పుడు, ఎక్కడ, ఎట్లా?

వ్యక్తుల అంగళ్లలో అమ్మకాలిస్తే మొదట చక్కెర అమ్మకం గతే పడుతుంది. కావున కో.ఆ. డిపోలున్నవి. వాటి ద్వారా అమ్మించడం సరైన పద్ధతి. తప్పు జేసిన తర్వాత దిద్దదానికంటె తప్పు చేసే అవకాశమే లేకుండా చేయడం నయము గదా! వారి అంగళ్లలో గాక ప్రత్యేక దుకాణాలు బెట్టి అమ్మిస్తారట. కూపన్లు యిస్తే తప్పు యిక యేం జేసినా కుంభకోణం జరక్కపోదు. అప్పుడు కళ్లెర్రజేసి సరిదిద్దే దానికంటె ముందుగానే సరియైన యోచన చేయడం మంచిది గదా!

* * *

అమెరికాకు వెళ్లియుండిన తిక్కవరపు రామిరెడ్డి గారి పుత్రుడు, "ఫిడేలు డజన్ రాగాల" గ్రంథకర్త అయిన పఠాభి గారు అమెరికా నుండి బైలు దేరి వచ్చి మధ్యలో దక్షిణాఫ్రికా తీరమగు కేప్ టవున్ చేరినట్లు వార్త అందింది. నెలరోజులలో వస్తారు.

* * *

నెల్లూరు జోషి మురా నుండి అభిప్రాయ భేదాలతో రావి ఆదిశేషయ్య, వెంకురెడ్డి, పి. నరసింహ రాజా గారలు రాజీనామా పెట్టిరట. నిజమేనా?

బత్తిన రామకృష్ణారెడ్డి గారి పెరోల్ పొడి గించి నందున వేలూరు జైలు మెట్లెక్కిన కాళ్లు తిరిగి యింటికి వచ్చినవి.

తిప్పారెడ్డి రామిరెడ్డి 14 తేది వెళ్లారు.

- విమర్శకుడు

## జనవాణి

### సాయిబాబా పేరులోనే "సత్యం"- సత్యానికి ఆయనకీ ఎప్పుడూ సరిపడదు!

గతవారం "సణుగుడు" శీర్షికలో సాయిబాబా పై వ్యాఖ్యలు బాబా భక్తులతో సహా అందరి తలలూ ఊపించాయి.

ఆయన పేరు సత్యసాయిబాబా! కానీ సత్యానికి ఆయనకు మొదట్నుంచి సరిపడదు. అసత్యాలు అభూత కల్పనలు ఆయన కీర్తి సౌధానికి పునాదులు. ఇన్నాళ్లు హేతువాదులకు, తార్కికులకు సత్య నిరూపణలో బాబా సహకరించలేదు. ఇప్పుడు తన హంతకుల విషయంలో కూడా ఆయన సత్యం చెప్పక పోవడం దారుణం! మీరు ఎంత అమాయకంగా నిష్కల్మషంగా ప్రార్థించినా ఆయన నిజం చెప్పడు. ఎందుకంటే నిజం బైట పడితే ఆయన దైవత్వం దెబ్బ తింటుంది. అందుకే తన పై దాడి చేసిన వారిని ఆయన పోలీసులచే కాల్చి చంపించాడని వదంతిగా ఉంది. సాయిబాబా రహస్య జీవితం గురించి బాగా తెలిసిన వారే ఈ హత్యకు కారకులు. ఆ రహస్య జీవితం గురించి బాబా చెప్పడమే బాగుంటుంది.

నెల్లూరు —కృష్ణచైతన్య

### పోలీస్ దౌర్జన్యం

గూడూరు టూ టౌన్ పోలీసులు ప్రజల పై తమ దౌర్జన్యాన్ని ప్రదర్శిస్తున్నారు. ట్రాఫిక్‌కు ఏ మాత్రం ఇబ్బంది లేని షాపుల పై పడి వాటిని ధ్వంసం చేస్తున్నారు. స్థలాలు తమ వని నిరూపించే మునిసిపల్ టాక్స్ రశీదులను చూపినా పట్టించుకోవడం లేదు. కేసుల సంఖ్య తగ్గడంతో ఫ్లాట్ ఫారం పై వ్యాపారాలు చేసుకొనే వారి మీద ఖాకీ జులుం ప్రదర్శించడం అన్యాయం. వున్నతాధికారులు ఈ విషయం విచారించి న్యాయం చేయాలి.

గూడూరు ఎల్. వెంకట సుబ్బయ్య

### వాస్తవానికి అద్దం పట్టారు

11 తేది 'జమీన్‌రైతు' సంచిక 'సణుగుడు' శీర్షికలో సత్యసాయిబాబా గూర్చి చేసిన వ్యాఖ్యలు వాస్తవ పరిస్థితులకు అద్దం పట్టాయి. భూత, భవిష్యత్, వర్తమాన కాలాలను తన ఆధీనంలో వుంచుకొన్నా నసుకునే బాబా తన పై జరిగే ప్రమాదాన్ని తెల్సుకోలేక పోవడానికి కారణమేమిటో అర్థం కావడం లేదు. మొత్తానికి తమ సంస్థలకు విరాళాలు ఎంత వస్తున్నాయో తెలియచెప్పక పోయినా, వాటిలో కొంత ఖర్చు పెట్టి కట్టిన విద్యాలయాలయాలు ఆసుపత్రులు ప్రజలకు ఎంతగానో వుపయోగ పడ్తాయన్నది వాస్తవం.

నెల్లూరు — పి. అరుణమ్మ

### వీరా జాతికి నేతలు?

మనదేశంలో అత్యున్నత పదవుల్లో వుండే నాయకుల చేష్టలు

కొరవ 10 వ పేజీలో

## నెల్లూరు సంగతులు

# తిక్కన పీఠం సాధించి తేవాలి!

ప్రివర్స్ ప్రంటు అవార్డు విజేత, యువ సంచలన కవి ఎండ్లూరు సుధాకర్ అభినందన సభ 10 తేది వర్ధమాన కాన్వెంట్‌లో 'సాహితీ మిత్ర' సంస్థ ఏర్పాటు చేసింది. సభకు అధ్యక్షత వహించిన మైసూరు విశ్వవిద్యాలయం రీడర్ డాక్టర్ ఆర్.వి. సుందరం సుధాకర్ కవితల్లో భావుకత, ఆర్ద్రత, సమాజ స్పృహ పుట్టిపడుతుంది. అందుకే చిన్న వయస్సులో అవార్డుకు అర్హుడయ్యారని ప్రశంసించారు. తెలుగు విశ్వవిద్యాలయం తిక్కన పీఠాన్ని నెల్లూరీయులు సాధించు కోవాలని సలహా యిచ్చారు. రోటేరియన్ వొమ్మిన సుబ్రహ్మణ్యం తన వుపన్యాసంలో సాహిత్య అభిరుచి గల పట్టణ ప్రజలలో 'సింహపురి సాహితీ సమితి' ని ఏర్పాటు చేస్తా నన్నారు. ప్రాచీన కావ్యాలు చదివి కవిత్వంలో పట్టు సంపాదించినట్లు ఎండ్లూరు సుధాకర్ చెప్పారు. అవార్డ్ తెచ్చిన వర్తమానం సంపుటిలోని కొన్ని కవితలు చదివి వినిపించారు. అనంతరం ఎండ్లూరి సుధాకర్‌ను, రీడర్ డాక్టర్ ఆర్.వి.ఎస్. సుందరంను దుశ్శాలువలతో సన్మానించారు. సభలో రచయిత పాయసం సుబ్రహ్మణ్యం, సురభి నరసింహం తదితరులు ప్రసంగించారు. పచ్చిపులుసు వెంకటేశ్వర్లు వందన సమర్పణ చేస్తూ ఇక నుండి నెలకొక పర్యాయం తమ సంస్థ ఆధునిక కవిత్వం పై సమావేశాలు జరుపు తుందన్నారు.

# పొదుపులో నెల్లూరు మహిళల ఉత్సాహం

దారిద్ర్యరేఖ దిగువన వున్న మహిళల కుటుంబాల్లో ఆర్థికాభివృద్ధి సాధించే లక్ష్యంతో ప్రారంభించిన పొదుపు వుద్యమం జిల్లాలో విజయ పథాన సాగుతుంది. దినసరి ఆదాయంలో ఒక్క రూపాయి పొదుపు చేయడమే ఈ డ్వాక్రా వుద్యమ లక్ష్యం. ఇప్పటి వరకు 4 వేల కుటుంబాలకు చెందిన మహిళలు 4 లక్షల రూపాయల మేర బ్యాంకులో పొదుపు చేసి రికార్డు స్థాపించారు. వీరంతా 150 గ్రూపులుగా ఏర్పడి ఈ లక్ష్యం సాధించారు.

వుద్యమాన్ని మరింత ముందుకు తీసుక పోయేందుకు జిల్లాలోని 30 మండలాలకు చెందిన మహిళలతో ఎంపిక చేసిన ఈ వుద్యమాన్ని 17 తేది నుండి 19 తేది వరకు శిక్షణా శిబిరాన్ని నిర్వహించారు. వుద్యమంలో మహిళలు ఎదుర్కొంటున్న కష్ట నష్టాలతో పాటు గ్రామీణాభివృద్ధి అంశాలు చర్చిస్తారు. శిబిరంలో పాల్గొనే వారికి వుచిత, భోజన, రవాణా వసతి కల్పిస్తున్నట్లు జిల్లా కార్యదర్శి శ్రీ ఎం. సాంబశివ రావు చెప్పారు.




నెల్లూరులో జరిగిన ప్రపంచ పర్యావరణ దినోత్సవ సభలో సిఎల్‌ఆర్ డైరక్టర్ డాక్టర్ జి. త్యాగరాజన్, పళని కాలేజి ప్రిన్సిపల్ డాక్టర్ పి. ఆదిలక్ష్మి, నెల్లూరు శాస్త్రవేత్త డాక్టర్ ఎ. జగదీశ్

## సూపరింటెండెంట్‌కు సమస్యల హారం

ఇటీవల నెల్లూరు రైల్వే స్టేషను తనిఖీ నిమిత్తం వచ్చిన విజయవాడ డివిజన్ సీనియర్ డిప్యూటీ కమర్షియల్ సూపరింటెండెంట్ దృష్టికి పలు సమస్యలను తీసుకెళ్లినట్లు సౌత్ సెంట్రల్ రైల్వే సలహా కమిటీ సభ్యులు వొమ్మిన సుబ్రహ్మణ్యం తెలుపుతున్నారు. మద్రాసు విజయవాడల నుంచి వచ్చే పినాకినీ ఎక్స్‌ప్రెస్‌లో 5 జనరల్, రిజర్వుడ్ కంపార్ట్‌మెంట్‌లో ఏర్పాటు చేయడంతో పాటు పినాకినీ ఎక్స్‌ప్రెస్‌ను సూపర్ ఫాస్ట్ నుంచి మామూలు ఎక్స్‌ప్రెస్‌గా మార్చాలని కోరారట. ఎండా కాలంలో సక్రమంగా పనిచేయని వాటర్ కూలర్, ఒకటవ నెంబర్ ప్లాట్‌ఫారం మీద నుండి క్రింద హాల్‌లోకి నీరు లీక్ అవుతున్న విషయం తెలియజేయగా అన్నింటిని పరిష్కరిస్తానని సూపరింటెండెంట్ హామీ ఇచ్చి వెళ్లారట.

# కాలుష్య ప్రమాదం ప్రజలకు చెప్పాలి!

విజ్ఞాన శాస్త్రాంశాలను సామాన్య ప్రజలకు చేరువగా తీసుక పోయేందుకు నెల్లూరు సొసైటీ ఆఫ్ సైన్స్ ఫర్ ది పీపుల్ సంస్థ చేస్తున్న కృషి ప్రశంసనీయం. ప్రతి మూడు నెలల కొకసారి ప్రపంచంలో ఆయా రంగాల్లో పేరు ప్రఖ్యాతులు గడించిన శాస్త్రవేత్తలను తీసుకొని రావడమంటే సామాన్య విషయం కాదు కదా! ప్రపంచ పర్యావరణ దినోత్సవాన్ని పురస్కరించుకొని ఇటీవల హోటల్ శివం కాన్ఫరెన్స్ హాల్‌లో జరిగిన సమావేశంలో కేంద్ర చర్మ పరిశోధన ప్రయోగశాల డైరక్టర్, మాజీ కామన్వెల్త్ వైజ్ఞానిక మండలి కార్యదర్శి డాక్టర్ జి. త్యాగరాజన్, పళని ఎ.పి.ఏ. కాలేజి ప్రిన్సిపల్ డాక్టర్ పునుగు ఆదిలక్ష్మి ముఖ్య అతిథులుగా పాల్గొన్నారు.

కాలుష్యం లేని సంప్రదాయేతర ఇంధన వనరుల వినియోగం పైనే ప్రపంచ పర్యావరణం ఆధారపడి వుందని డాక్టర్ త్యాగరాజన్ చెప్పారు. 19 వ శతాబ్దం మొదలు నుండి 65 సంవత్సరం లోపల ఇంధన వుపయోగం 600 శాతం పెరిగింది. ఈ శతాబ్దం అంతానికి ఇంకా 450 శాతం పెరిగే అవకాశముంది. ఇంధన నిల్వల మీదే దేశ ప్రగతి ఆధారపడి వుందన్న విషయం మరువ కూడదన్నారాయన. నీటిని ప్రజలు తెలివిగా వుపయోగించక పోతే ప్రపంచ వ్యాప్తంగా నీటి ఎద్దడి తప్పదన్నారు. సముద్రంలోకి వదులుతున్న కలుషిత పదార్థాల వల్ల ఏర్పడుతున్న ముప్పును కళ్లకు కట్టినట్లు వివరించారీ శాస్త్రవేత్త. పర్యావరణ ఆవశ్యకతను ప్రజలకు తెలియ చెప్పడంలో స్వచ్ఛంద సంస్థలు కృషి చేయాలని డాక్టర్ పి. ఆదిలక్ష్మి సూచించారు. నెల్లూరులోని సొసైటీ ఆఫ్ సైన్స్ ఫర్‌ది పీపుల్ సంస్థ ప్రపంచ వ్యాప్తంగా వైజ్ఞానిక పత్రికల్లో చోటు చేసుకోవడం పట్ల హర్షం వ్యక్తపరిచారు. కార్యక్రమానికి సొసైటీ అధ్యక్షుడు డాక్టర్ ఎ. జగదీష్ స్వాగతం చెప్పగా కార్యదర్శి శ్రీ వి.వి. లావణ్య రావు వందనాలు పల్కారు.



కొరవ 11 పేజీలో

## సణుగుడు

### సాయిబాబా పై దర్యాప్తు జరపడానికి లేదని కేంద్ర హోంమంత్రి చెప్పడం దారుణ చట్ట ధిక్కారం కాదా?

సత్యసాయి, బాబా భక్తులు చండాలపు భాషలో నన్ను శాపనార్థాలు పెడుతున్నారు; సాయిబాబా నిజాలు చెప్తే బాగుంటుందని నేను చేసిన స్వల్ప వ్యాఖ్యకే తెగబాధ పడిపోతున్నారు. ఒక సాయి భక్తుడు అక్షింతలు వేస్తూ వ్రాసిన జాబు చదవండి - "పత్రిక మీది కదా అని మీ ఇష్టం వచ్చినట్లు వ్రాసుకుంటే అది మీ తెలివి తక్కువ తనానికి ప్రతీక. భగవాన్ శ్రీ సత్యసాయి బాబాను ఒక రాజకీయ లోఫర్‌తో పోల్చారంటే మీరెంత లోఫరో బాగా అర్థమౌతుంది. మన దేశం దాటి పోని బాబా దగ్గరకు 99 దేశాల నుంచి భక్తులు వస్తున్నారంటే వాళ్లు ఎందుకు వస్తున్నారో మీరు పూర్తిగా తెలుసు కోనవలసింది".

ఇటువంటి జాబులు చాలానే వస్తున్నాయి. వారి ఆవేదనలోనూ అర్థం వుంది. తాము భగవంతుడిగా నమ్మే వ్యక్తిని మహిమలు లేని మామూలు మనిషన్న నిజం బహిరంగంగా చెప్పేస్తే మనసుకు కష్టమే కదా! కాని అంధ విశ్వాసాలతో, మూర్ఖత్వంతో ఇటు నేతలు, అటు భక్తులు కలిసి క్రిమినల్ చర్యలకు పాల్పడిన వ్యక్తిని, - అతడు బాబా గాని, భగవంతుడే కాని - చట్టం నుంచి రక్షించడానికి నిస్సిగ్గుగా చేస్తున్న ప్రయత్నాన్ని నిరసించడం పాత్రికేయ ధర్మం కాదా? ఆస్పత్రులు కట్టించి, చదువు చెప్పించి, ధానధర్మాలు చేసినంత మాత్రాన సాయిబాబా చట్టాని కతీతుడౌతాడా? ఆ వాదన సరైనదైతే - స్మగ్లింగ్‌లో కోట్లు సంపాదించి ఆ తర్వాత ట్రస్ట్ స్థాపించి ప్రజోపయోగ కార్యక్రమాలకు ముష్టి విదిలిస్తున్న హాజీమస్తాన్ వంటి వారినీ మనం సమర్థించాల్సి వస్తుంది కదా? హర్షద్ మెహతా కూడా తాను దోచుకున్న వెయ్యి కోట్లలో ఒక వంద కోట్లు ఖర్చు పెట్టి ఒక ఆస్పత్రి కట్టించ గల్గితే - కేసులన్నీ విత్‌డ్రా చేయమని సిఫార్సు చేయాల్సిందే కదా?

హాజీ మస్తాన్, హర్షద్ మెహతాల వంటి సంఘ ద్రోహులతో సత్య సాయిబాబాను పోల్చడం నా ఉద్దేశ్యం కాదు. కాని, నేరమంటూ చేస్తే ఎవ్వరైనా, వీరైనా చట్టం దృష్టిలో ఒకటి గానే వుండాలన్నది నా అభిమతం. పుట్టపర్తి హత్యాకాండలో చిక్కిన సత్యసాయి బాబాను తప్పించడానికి ప్రధాన మంత్రి నుంచి ముఖ్యమంత్రి వరకు, కేంద్ర హోం మంత్రి నుంచి రాష్ట్ర డిజిపి వరకు చేస్తున్న విశ్వ ప్రయత్నాలు చూస్తుంటే మనది ప్రజాస్వామ్య దేశమని చెప్పుకోవడానికి సిగ్గేస్తున్నది. సాయిబాబాకు ఈ హత్యలతో ఏ సంబంధమూ లేకపోవచ్చు. కాని హత్యలు జరిగింది ఆయన ప్రశాంతి నిలయంలో; అదీ ఆయన పడక గదిలో! అయినా ఈ

## డోలేంద్ర

హత్యాకాండలో ఆయన్ను ప్రశ్నించ వలసిన అవసరం లేదని సాక్షాత్తు కేంద్ర హోం మంత్రి ప్రకటించారంటే ఏమనుకోవాలి? తమ దృష్టిలో మహిమలు కల్గి, తమ పదవులను మంత్ర తంత్రాలతో పరి రక్షించే వ్యక్తులు హత్యలు చేసినా, చేయించినా, అది నేరం క్రింద జమ కాదా? ఏమిటీ అన్యాయం? కాషాయి వస్త్రాలు కట్టి, ఢిల్లీ నేతల చేత పూడిగం చేయించుకో గల్గిన వారు చట్టానికి అతీతులై పోతారా? ఏమిటో బరితెగింపు చట్టధిక్కారం?

ఈ సంఘటనలో పలు అంశాలు అనుమానాలకు దారి తీస్తున్నాయి. పోలీసులు ఎంత దాచి పెట్టినా; డిజిపి, హోంమంత్రి పుట్టపర్తిలో మకాం పెట్టి బాబా ఆదేశాలను శిరసావహిస్తూ దర్యాప్తును పెడదారి పట్టిస్తున్నా చాలా నిజాలు దాగడం లేదు. పత్రికా విలేఖరులు చాలా సాహసంగా వాటిని వెలికి

కొరవ 8 పేజీలో

అల్లూరు అధికారుల స్మశానంలో గోరీల వేటలో బయల్పడిన.....

# ఆ నగ్న యువతి శవం ఎవరిది ? ఎక్కడిది?

అల్లూరు అధికార్లను ఏదో స్మశాన ప్రేతం ఆవహించి నట్లుంది. శుభ్రంగా ఆఫీసుల్లో కూర్చొని కాగితాలు చూసుకోవాల్సిన వారిని స్మశానానికి రప్పించింది. గోరీలు తవ్వించింది. శవాలు వెలికి తీయించింది. నానా భ్రష్టు పట్టించింది.

అల్లూరు ఎమ్మార్వోకు వారం క్రితం ఒక రిజిష్టర్ జాబు అందింది- మాసారం మాలకొండయ్య అనే స్కూలు టీచరు తన కుమారుడైన మల్లికార్జునను చంపి, రహస్యంగా స్మశానం ప్రక్కన కాలువ గట్టుపై పూర్చి పెట్టారు. చర్య తీసుకోండి - అని! మల్లి ఖార్జున అల్లూరులో పేరు మోసిన రౌడీ. చిన్న తనం నుంచి అల్లరి చిల్లరిగా తిరగడం అలవాటట. వేయని దొంగతనం లేదు. అప్పుడప్పుడు పోలీసులే అతడిని చిల్లర దొంగతనాలకు వాడుకునే వారని ప్రతీతి. పోలీసు స్టేషను అత్తింటితో సమానం. అక్కడికి పోవడం, రావడం అతడికి మామూలే! త్రాగివచ్చి ఇంట్లో తల్లిని, చెల్లెలిని కూడా కొట్టేవాడట. వాడికి మల్లి ఒక ఉంపుడు కత్తె. ఆ మధ్య ఒక రోజు త్రాగి. ఉంపుడు కత్తెను వెంట బెట్టుక వచ్చి ఆస్తి కోసం పేచీ పెట్టుకున్నాడట. ఈ నీచుడి వేధింపు భరించ లేక తండ్రి. ఇద్దరు సోదరులు కలిసి అతడ్ని చంపి. ఒక రోజంతా ఇంట్లోనే శవాన్ని మంచం క్రింద దాచి పెట్టి, తెల్లవారు ఝామున వూరి బయట స్మశానానికి తీసుక వెళ్లి పూర్చి వచ్చేశారట. ఆ సంగతి ఆకాశ రామన్నలు ఎమ్మార్వోకు, ఎస్ఐకి వ్రాశారు. అందులో- రాశాని వారి సమాధి ప్రక్కన శవాన్ని పూడ్చినట్లు తెల్పారట. ఒకటి రెండు రోజులు ఎమ్మార్వో, ఎస్ఐలు ఈ జాబును పట్టించుకోలేదు. తిరిగి ఇంకొక ఉత్తరం వచ్చింది - అది పై అధికారులకూ చేరడంతో ఎమ్మార్వో ఎస్ఐను తొందర పెట్టి స్మశానానికి తీసుక వెళ్లారట. అక్కడ చూడాలి వారి బాధలు. ముందు ఒక చోట త్రవ్వారు - కుక్క శవం

## జిల్లావార్తలు

బయట పడింది; దాన్ని పూడ్చి ఇంకొక చోట త్రవ్వారు - అందులో వివస్త్రగా వున్న ఒక అందమైన యువతి శవం కన్పించింది. అదీ మిస్టరీ చావని అన్పించడంతో ఆ న్యూసెన్సు తలకెత్తుకోవడం ఎందుకని గబగబా పూడ్చి పారేశారు. చివరకు కాలువ గట్టున, తుప్పల మధ్య మల్లిఖార్జున శవాన్ని పట్టుకో గల్గారు. అప్పటికి వూపిరి పీల్చుకొని, చీకటి పడి పోవడంతో తిరిగి మట్టి కప్పి పెట్టి, తలారిని కాపలా పెట్టి తిరిగి వచ్చేశారట. 13 తేది డిఎస్‌పి, సిఐల సమక్షంలో మరొకసారి అదే గుంటను త్రవ్వి, శవాన్ని వెలికి తీసి పంచనామా జరిపారు. రెండు సార్లు త్రవ్వడంలో శవం మెడ తెగి, తలా మొండెం వేరై పోయాయి. మల్లిఖార్జున తండ్రిని పోలీసులు అరెస్ట్ చేశారు.

ఇక్కడి వరకు బాగానే వుంది కాని పోలీసులు పొరపాటున త్రవ్వి గబుక్కున మట్టి కప్పేసిన యువతి శవం ఎవరిదన్నదే మిస్టరీగా మారింది. ఆమె స్థానికురాలు కాదు. అది సహజ మరణమై స్మశానంలో పూడ్చిన శవం కూడా కాదు. ఆమె వంటి పైన రవిక తప్ప మరొక ఆచ్ఛాదన లేదు. పైగా శవాన్ని కేవలం రెండు, మూడడుగుల లోతు కూడా లేని గోతిలో ఆదరబాదరా పూడ్చినట్లు కన్పించింది. ఆ గొయ్యి తీరు చూస్తే ఎవరో చంపి, రహస్యంగా పూడ్చి వెళ్లారన్పిస్తుంది! అదే నిజమైతే ఆ యువతి ఎవరు? ఏ వూరికి చెందినది? స్థానికురాలు కాకుంటే ఎక్కడో చంపి ఇక్కడ తెచ్చి పూడ్చవలసిన అవసరం ఎందుకు కల్గింది? ఆ శవం వంటి పైన గుడ్డలేవై పోయాయి? వివస్త్ర చేశారంటే ఆమె పై అత్యాచారం ఏదైనా జరిగి వుంటుందా? ఇవన్నీ ప్రశ్నలే. వీటికి సమాధానం కావాలంటే తిరిగి శవాన్ని వెలికి తీసి దర్యాప్తు ప్రారంభించడం అవసరం. పొరపాటునో, గ్రహపాటునో శవం తమ కళ్లబడినప్పుడే ఎమ్మార్వో, ఎస్ఐలు పంచనామా చేసి విచారణ జరిపి వుంటే ఈ పాటికి కొంతైనా సమాచారం వెలికి వచ్చివుండేది. అప్పుడు శవం ఫ్రెష్‌గా వుండిందట; అంతకు రెండు మూడు రోజుల ముందే పూడ్చినట్లు కన్పించిందట. తమకెందు కొచ్చిన న్యూసెన్స్ అని వారు దాన్ని పూడ్చి పెట్టెయడంతో ఇప్పుడు అల్లూరంతా ఇదే చర్చ. ఉన్నతాధికారులెవరైనా దీని పై దర్యాప్తు జరిపిస్తారా?

### వాసిలి వరద రాజస్వామి వుత్సవాలు

వాసిలి వరద రాజ స్వామి వారి బ్రహ్మోత్సవాలు 1 తేది నుండి 9 తేది వరకు ఘనంగా జరిగాయి. గ్రామస్థుల సహకారానికి, వుభయ కర్తల ప్రోత్సాహం తోడవ్వడంతో ఎక్కడా లోటు కనపడలేదు. నిషేధింప బడిన సారాతో బాటు డైమన్ డబ్బా ఆట కూడా హద్దు-పద్దు లేకుండా సాగిపోయాయి.

# రోడ్డుకు నడకొచ్చి దారితప్పినా దారిలేని వారికి దుర్గతి తప్పలేదు!

రోడ్డుకు మంజూరు చేసిన నిధులు పక్కదారి పట్టిపోయాయి; ఆ విషయాన్ని పరిశీలించి న్యాయం చేయండని ప్రజలు పెట్టుకున్న వినతి పత్రాన్ని అట్టే అట్టి పెట్టుకున్న అధికారుల వుదాసీనతకు అద్దం పట్టే విషయమిది. కొడవలూరు మండలం దామేగుంట హరిజనులకు చౌకచర్ల గ్రామ రెవిన్యూలో పంట భూములున్నాయి. కాని పొలంలోకి పోయి వ్యవసాయ పనులు చేసుకునేందుకు రహదారి లేక వారు పడే ఇక్కట్లు వర్ణనాతీతంగా వుండేవి. అప్పటి శాసన సభ్యుడు స్వర్గీయ నల్లపరెడ్డి శ్రీనివాసులు రెడ్డి పుణ్యమా అని దామేగుంట నుండి చౌకచర్ల వరకు లింకు రోడ్డు నిర్మాణానికి మూడు లక్షలు మంజూరయ్యాయి. ఈ పని కాంట్రాక్టును ఆ గ్రామంలోని ఒక మాజీ రాజకీయ నాయకుడు బినామీ పేరుతో పొంది, మంజూరైన నిధులతో తన పొలం చివర వరకు దర్జాగా రోడ్డు వేసుకొన్నాడట. ప్రభుత్వ నిధులను స్వంత ప్రయోజనాలకు వినియోగించుకొన్న తీరు, తమ సమస్య అణు మాత్రం పరిష్కారం కాని స్థితిని గ్రామస్థులు సంవత్సరం క్రితం కావలి ఆర్డీవోకు, కొడవలూరు ఎమ్మార్వోకు తెలుపు కొన్నారు. ఎందువల్లో ఈ విషయంలో పరిష్కారానికి చొరవ చూపని అధికారులు ఈ ఫైల్‌ను జాయింట్ కలెక్టర్‌కు పంపారట. ఇక అంతే! 6 నెలలుగా ఫైలు దుమ్ము, ధూళి మధ్య కలెక్టర్ ఆఫీసులో చిక్కు కొని వుంది. తన పొలం గుండా వేసిన రోడ్డులో ఆసామి పోనివ్వక, వ్యవసాయం చేయలేక చివరకు తమకు కన్నీళ్లే మిగిలా యంటున్నారు, ఈ రైతులు. వీరి కన్నీళ్లను అధికారులు తుడవ వలసిన బాధ్యత అధికారుల పైనే వుంది.

### వాసిలి ఆశ్రమం

వాసిలి గ్రామ సమీపంలో నెల్లూరు బొంబాయి రోడ్డులో శ్రీ హనుమాన్ సమేత సీతారామా శ్రమం 9 తేది ప్రారంభించ బడింది. దీనిని ఇంతకు మునుపు ఈ గ్రామంలోనే నివశించి తరువాత నెల్లూరు చేరి, ధాన్యం వ్యాపారంతో ధనవంతుడైన శ్రీమునగా వెంకట రమణయ్య 4 లక్షలు ఖర్చు చేసి కట్టించారు. ముందు వినాయక విగ్రహ ప్రతిష్ఠ చేసి తరువరి సీతారాముల కళ్యాణం జరిపించారు. వార్ధక్య దశలోని వారికి అన్ని విధాల అనుకూలంగా వుండే ఆశ్రమం కట్టించిన వెంకట రమణయ్య ధన్యజీవి.

# మైపాడు బీచ్ ఇక అంతేనా?

ఎందరెందరు ఎన్నిమాటలు చెప్పారో- మైపాడు బీచ్ అభివృద్ధి గురించి; వారంతా చిన్నప్పుడు ఇసుకలో అక్షరాభ్యాసం చేసినవారై

**గెస్ట్‌హౌస్ పాడుబడి పోయింది; సముద్రతీరం దగ్గర మంచి నీళ్లకూడాలేవు; టూరిస్టుకేంద్రం కావలసింది ఇసుకదిబ్బలుగా మిగిలివుంది !**

వుండాలి. వారి వాగ్దానాలూ ఇసుకలో వ్రాతలై గాలికి చెదరి పోయాయి. ఒక్కరంటే ఒక్కరు కూడా అన్నివిధాలా అనుకూలమైన ఈ బీచను పట్టించుకోలేదు.

మైపాడు, సముద్ర విహారానికి మంచి ప్రదేశం. ఒక్క నెల్లూరే కాదు. సముద్రమంటే ఎట్లా వుంటుందో చూడాలని వచ్చే కడప, చిత్తూరు వాసులకూ అదొక విహార కేంద్రం. అభివృద్ధి చేస్తే ఎప్పుడూ జనంతో కళకళలాడవలసిన ప్రదేశం. కాని ఇప్పుడది నిర్మానుష్యంగా వుంది; ఆదివారం తప్ప అక్కడ జన సంచారమే లేదు. ఎట్లా వుంటుంది? వసతులేమైనా వుంటే కదా? సముద్రపుటొడ్డున వుండే పిడబ్ల్యూడి గెస్ట్‌హౌస్ ఎప్పుడో పాడుబడిపోయింది. ఆలన పాలన లేక ఆ గదులకు ముందు ఇసుక దిబ్బలేర్పడ్డాయి. గెస్ట్ హౌస్‌లో మంచి నీళ్లకూడా దొరకవు. ఇదివరకు అక్కడ పట్టపుపాళెం వుండేది. అవసరమైతే వారు గుక్క తడిపేవారు. ఇప్పుడు వారూ ఉప్పుకాలువకు పడమరగా వెళ్లిపోయారు.

కాలువ ఒడ్డున కట్టిన సమాచారశాఖ అతిథి గృహం చూడడానికి గంభీరంగా వుంటుంది. లోపలకు వెళ్తే దయ్యాల కొంప మాదిరి వుంటుంది. రిపేర్లంటూ ఏమో చేశారు కాని, గబ్బిలాల కంపు మాత్రం తొలగలేదు. ఉప్పుకాలువపై మొదలు పెట్టిన బ్రిడ్జి పదేళ్లయినా పూర్తికావడం లేదు; ఇప్పట్లో అవుతుందన్న నమ్మకమూ లేదు. అదృష్టవశాత్తు రొయ్యల కంపెనీలు వచ్చి, ఎవరికి అవసరమైన దగ్గర వారు రోడ్లు వేసుకోవడం వల్ల కాలువలో నీళ్లు లేవు కాబట్టి, ఆ వంతెన అవసరమూ లేకుండా పోయింది.

నెల్లూరు జిల్లాలో చెప్పుకోదగిన విహార కేంద్రం ఒక్కటీ లేదు.

కొరవ 8 పేజీలో

# నెల్లూరు ముచ్చట్లు

విమర్శకుడు

## ఈ యుద్ధం ఏ రూపం తీసుకో బోతుంది?

ఆనం – మాగుంటల మధ్య ప్రారంభమైన యుద్ధం జిల్లా రాజకీయాలలో ఏ విపరీతాన్ని సృష్టించ నున్నదో అర్థం కావడం లేదు. ''అలుగుటయే ఎరుంగని మహా మహితాత్ముడజాత శత్రువే అలిగిన వాడు'' అన్నట్లు సుబ్బరామ రెడ్డి గారు పౌరుషంగా వున్నారు. ఆయనలో ఏ మాత్రం సర్దుబాటు ధోరణి కన్పడడం లేదు. హైదరాబాదులోని ఒక సీనియర్ పోలీసధికారి ఈ విషయంలో ఆయనకు నచ్చచెప్పడానికి ప్రయత్నించారట. కాని తను నిస్వార్థంగా లక్షలు ఖర్చు పెట్టుకొని ఎన్నికలలో ఎందనక వాననక తిరిగితే తన పై నిందలు వేసి అవమానించిన తర్వాత సర్దుబాటు తన నుంచిఎందుకు రావాలనేది ఆయన పంతం. తిరిగి అభ్యర్థిని తొలగింపు ఒక్కటే ఈ సమస్యకు పరిష్కారమన్న ఉద్దేశ్యంతో వున్నారాయన. ఆ భారం ముఖ్యమంత్రి పైన, జనార్దన రెడ్డి గారి పైన వేసేశాడు. ఆనం వారూ వారిద్దరినే నమ్ముకున్నట్లున్నారు. ముఖ్యమంత్రికి ఈ వివాదం వినోద దాయకమే కాని, జనార్దన రెడ్డి గారికి మాత్రం ప్రాణ సంకటంగా వుంది. ఎవరి కోసం ఎవర్ని వదులు కొంటారు?

వారం, పది రోజుల లోపల తమ డిమాండ్ నెరవేరని పక్షంలో జిల్లా రాజకీయాలలో ప్రత్యక్షంగా పాల్గొనాలనేది సుబ్బరామ రెడ్డి గారి తలంపు అని చెప్తున్నారు. దాని అర్థం ఏమిటో ఇంకా స్పష్టంగా బోధ పడడం లేదు. స్వంత గ్రూపు నిర్మాణం ఉద్దేశ్యంగా వుంటుందా? స్వంత గ్రూపు అంటే అది జనార్దన రెడ్డి దివాణంలో బ్రాంచి ఆఫీసుగా వుంటుందా? లేక జనార్దన రెడ్డికి పోటీ పెట్టేదిగా వుంటుందా? మాదాను గంగాధరం గారు ఎమ్మెల్యేల దగ్గరకు రాయబారాలు నడుపుతున్నారు. ఆ రహస్య సంభాషణలలో ఏమి చర్చలు జరుగుతున్నాయో తెలియడం లేదు. ఎమ్మెల్యేలకూ ఇది వినోదంగా వుంది. జనార్దన రెడ్డి గ్రూపులోని సబ్ గ్రూప్ అయితే ఎవరికీ పేచీ లేదు. రెండు పడవలలో కాళ్లు పెట్టి హైలెస్సా అంటూ షికార్లు చేస్తారు. దారులు వేరైతే బంధాలు త్రెంచుకొని వచ్చే వారెందరు? జనార్దన రెడ్డి పై అలుక, అసంతృప్తులు వున్నా విభేదించి బయట పడేంత సాహసికులు ఎందరున్నారు? ఆ సాహసం వల్ల వారికి వచ్చే లాభమేమిటి? ఎన్నికలు కనుచూపు మేరలోకి వచ్చిన సమయంలో రిస్క్ తీసుకొంటారా? అసలు సుబ్బరామ రెడ్డి గారు అంతటి ప్రయత్నం చేస్తారా? జనార్దన రెడ్డి గారితో తనకున్న స్నేహ సంబంధాలు, ఇతర మొగమాటాలు అంత తేలికగా త్రెంచుకొనేవా?



## రవి చిన్న పిల్లల ఆస్పత్రి

ప్రాక్టీసు ప్రారంభించిన స్వల్ప కాలంలోనే నెల్లూరులో పేరున్న డాక్టరుగా గుర్తింపు పొందిన చిన్న పిల్లల వైద్యుడు డాక్టర్ బి. రవి కుమార్ పొగతోటలో స్వంత భవనం కట్టుకొని ఆస్పత్రి ప్రారంభించాడు. నెలలు నిండని పిల్లల కోసం ఇంక్యుబేటర్, పచ్చ కామెర్ల వ్యాధితో జన్మించిన పసికందులను కాపాడే ఫోటో థెరపి విభాగం అందులో నెలకొల్పారు. ఈ రెండు ఆధునిక వైద్య పరికరాలూ జిల్లాలో మరెక్కడా లేవు.

రవి హస్తవాసి కల్గిన డాక్టరు; అతడికి విజయం చేకూరాలని మా ఆకాంక్ష!

## యోగయ్య నాయుడుకు ఫ్యాప్సి అధ్యక్షత

మనబోలు మండలం లక్ష్మీనరసింహాపురం రైతు కుటుంబీకుడు శ్రీ బి. యోగయ్య నాయుడు ఆంధ్రప్రదేశ్ ఛాంబర్ ఆఫ్ కామర్స్ అండ్ ఇండస్ట్రీ ఫెడరేషన్ (ఫ్యాప్సి)



అధ్యక్షుడుగా ఎంపికైనారు. ప్రతిష్ఠాత్మక పదవి ఇది. ఒక నెల్లూరీయుడు ఈ పదవికి ఎంపిక కావడం ఇదే ప్రథమం.

యోగయ్య నాయుడు ఇంజనీరింగు చదివి, ఉద్యోగాలకు వెళ్ళక 1967 లోనే తెలంగాణాలో చిన్న తరహా తెగుళ్ల మందుల పరిశ్రమ ప్రారంభించాడు. అదృష్టం కలిసి వచ్చి

కొరవ 7 పేజీలో

## నెల్లూరు ముచ్చట్లు

(6 పేజి తరువాయి)

అది లక్ష్మీ నాయకత్వం చేకూర్చి పెట్టింది. ఇంగ్లండు జర్మనీలలో ప్లాస్టిక్ టెక్నాలజీలో శిక్షణ పొంది సైన్సులో ముందు గుండు కామగ్రి నిల్వచేసే కింపైసర్ల ఉత్పత్తి ప్రారంభించారు. అది విజయవంతమైంది. ఆ తర్వాత స్వయంగా ఎక్స్‌ప్లోజివ్స్ తయారీ పరిశ్రమ స్థాపించారు. చిన్న తరహా పరిశ్రమల అభివృద్ధి కోసం శ్రీ నాయుడు చాలా కృషి చేశారు. ఎపిఐడిసి, ఎపిఎస్ఎఫ్ఐడిసి లలో డైరక్టరుగా పనిచేశారు. హైదరాబాదులోని ప్రసిద్ధ 'చైతన్య భారతి ఎడ్యుకేషనల్ సొసైటీ' స్థాపకులలో ఆయన ఒకరు. ఈ సంఘం క్రింద ఒక ఇంజనీరింగు కాలేజి, ఒక పబ్లిక్ స్కూలు నడుస్తున్నాయి. జవహర్ లాల్ నెహ్రూ టెక్నాలజికల్ యూనివర్సిటీ ఎగ్జిక్యూటివ్ కౌన్సిల్‌లో ఆయన సభ్యుడు. ఫ్యాప్సి అధ్యక్షత ఈ విజయాలన్నింటికీ శిఖర సమానమైనది.

యోగయ్య నాయుడు తండ్రి జమీందారీ వ్యతిరేక ఉద్యమంలో పాల్గొన్న దేశ భక్తుడు. జమీన్‌రైతుతో వారి కుటుంబానికి ప్రగాఢ సాన్నిహిత్యం వుంది. ఉన్నత పదవి స్వీకరించిన నాయుడు గారికి మా అభినందనలు.

### ఐపిఎస్‌కు నెల్లూరు విద్యార్థి

తోటపల్లి గూడూరు మండలం వెంకన్నపాళెం పెద్ద రైతు శ్రీ మూలంరెడ్డి వెంకట కృష్ణారెడ్డి మనుమడు, వేణుగోపాల రెడ్డి కుమారుడు – సతీష్



కుమార్ రెడ్డి ఐపిఎస్‌కు ఎంపికైనారు. జాతీయ స్థాయిలో ఆ విద్యార్థికి 146 ర్యాంకు వచ్చింది; రాష్ట్రంలో 7 ర్యాంకు సాధించారు. సతీష్ విఆర్ కాలేజి విద్యార్థి; ఇప్పుడు హైదరాబాదు ఉస్మానియా విశ్వవిద్యాలయంలో బి.టెక్. చదువుతున్నారు. ఆ విద్యార్థికి మా అభినందనలు.

### పొగతోట డాక్టరింట్లో దోపిడీ

పొగతోటలోని డాక్టర్ దంపతులు – సుందరయ్య, మాలతిల ఇంట్లో 16 తేది రాత్రి పెద్ద దోపిడీ జరిగింది. న్యాయవాది శ్రీ పి.వి. రమణారెడ్డి ప్రక్క ఇల్లు వారిది. ఐదుగురు బందిపోట్లు మొదట రమణారెడ్డి గారి ఇంటికే వచ్చారట. కిటికీ గ్రిల్ పెరకడానికి ప్రయత్నించి విఫలులైనారు. వెంటనే ప్రక్కనే వున్న సుందరయ్య గారి ఇంటిపై పడ్డారు. బెడ్‌రూము కిటికీ గ్రిల్ తొలగించి లోపల దూరారు. అందరూ ముఖాలకు ముసుగులు వేసుకొని వున్నారట. లోపల నిద్రపోతుండిన డాక్టర్, ఆయన కూతురు, పనిమనిషిని, నిద్రలేపి, వారిని కట్టి పడేశారు. ప్రక్క గదిలో వుండిన మనోజ్ అనే యువకుడ్ని కూడా బంధించారు. మరొక గదిలో వుండిన మిగిలిన ఇద్దరు కూతుళ్లను బెదరించి, కట్టిపడేసి, బీరువా తాళాలు లేవనేసరికి, దాన్ని మంచం పైకి వాల్చి పగులగొట్టి సర్వం దోచుకున్నారు. 48 సవర్ల నగలు, 15 వేలు డబ్బు, ఒక కెమరా దోపిడీ అయ్యాయి. దాదాపు గంట సేపు జరిగింది దోపిడీ. తర్వాత వచ్చిన దారినే, కిటికీ గుండా బయటకు దూకి, రమణారెడ్డి గారి మిద్దె పై నుంచి పారిపోయారట. ఆ సమయానికి డాక్టరు మాలతి గారు లేరు; ఆస్పత్రికి వెళ్లి వుండినారు. విషయం తెలిసిన వెంటనే, వేకువన డిఎస్‌పి తదితర అధికారులు వచ్చి చూసి వెళ్లారు.

కిటికీ గ్రిల్స్ దొంగల ముఠా చాలా కాలం నుంచే తప్పించుక తిరగగల్గుతూంది; పోలీసు గట్టి చర్య తీసుకోవాలి!

### పెద్దాస్పత్రి సస్పెన్షన్

పెద్దాస్పత్రి సూపరింటెండెంట్ డాక్టర్ రామిరెడ్డిని ప్రభుత్వం సస్పెండ్ చేసింది. మందుల అమ్మకం కుంభకోణంలో జరిగింది సస్పెన్షన్. రామిరెడ్డి గారు చాలా కాలం నుంచి ఆస్పత్రి చూరు పట్టుకొని వేలాడుతున్నారు. బదలీ చేసి, వేరే డాక్టరును నియమించినా కోర్టు స్టే తెచ్చుకొని రెండవ కుర్చీ వేసుకొని పెత్తనం చేస్తుండినారు. సస్పెన్షన్‌తో ఆ ఆస్పత్రి పీడ విరగడైంది.

పెద్ద పెద్ద చదువులు చదివిన వారు కూడా ఇంత అల్పంగా ఎందుకు ప్రవర్తిస్తారో మరి!

### ఐఆర్ఎస్‌కు కూడా నెల్లూరు విద్యార్థి

సివిల్ సర్వీసెస్‌లో మరొక ముఖ్య విభాగం – ఇండియన్ రెవిన్యూ సర్వీసెస్‌కూ ఈ ఏడాది ఒక నెల్లూరు విద్యార్థి ఎంపికైనాడు. బుచ్చిరెడ్డి పాళెం పిడబ్ల్యుడి అసిస్టెంటు ఎగ్జిక్యూటివ్ ఇంజనీరుగా పనిచేస్తున్న శ్రీ పొట్టిపాళెం చంద్రశేఖర్ 290 ర్యాంకుతో ఈ ప్రతిష్ఠాత్మక సర్వీసుకు ఎంపికైనాడు. చంద్రశేఖర్ ప్రతిభావంతుడైన విద్యార్థే కాకుండా కవి, చిత్రకారుడు కూడా! వెంకటగిరిలో స్కూలు చదువు చదివి, విఆర్ కాలేజిలో ఇంటర్ పాసైనారు. వరంగల్ ఆర్ఇసిలో బి.టెక్., ఉస్మానియాలో జర్నలిజం డిప్లొమా



చేశారు. అన్నిటిలోనూ ఫస్ట్ క్లాసు పాసు చంద్రశేఖర్ విశిష్టత. ఇతడి తండ్రి పి. శివరామదాసు బుచ్చిలో విడిఒ.

**జమీన్‌రైతు**
సంవత్సర చందా రు 100/-
6 నెలలకు - రు. 50/-
విడిప్రతి - రు. 2.00





జమీన్‌రైతు
సంవత్సర చందా రు. 100/-
6 నెలలకు - రు. 50/-

## ప్రకటన

ఇందు మూలముగా యావన్మందికి తెలియ చేయునది ఏమనగా నెల్లూరు జిల్లా దగదర్తి మండలం పెదపుత్తేడు గ్రామమందు పట్టా నెం. 157, సనెం. 55 లో Ac - 1-16 పట్టా 106 S.No. 105 D, Ac 0-41 మొత్తం A.C. 1-57 పొలము 35 అంకణములలో చిన్న పెంకుటిల్లు సన్నిహితురాలు కీ.శే. వాకాటి వెంకట సుబ్బమ్మ పేరుతో పట్టా 216 S.No. 54 A.C. 0-43 భూమిన్ని కలసి నా స్వార్జిత అనుభవములో యున్నది నా హక్కులతో 4-5-90 తేదిన 2 సంవత్సరములు పాలపాటి రమణారెడ్డికి కౌలుకు ఇచ్చినంతట సదరు గ్రామ వాసి. వేదగిరి కృష్ణమాచార్యులు పాత కౌలుదారు కుందుర్తి పెద్దయ్య. కుమారుడు కె. వెంకటేశ్వర్లు (టీచర్) వీర్లు లాలూచి పడి మోసగించి బెదిరించి దౌర్జన్యముగా భూమి సాగు చేసుకొని 3 సంవత్సరములు గా రావలసిన ధాన్యము తిని వేసినారు. దాదాపు 5 పుట్ల ధాన్యము కోర్టు ద్వారా ఇవ్వ వలసి నట్లు నాకు అనుకూలముగా ఎక్స్‌పార్టీ డిక్రీ అయి యున్నది. ఇంతలో మరియొక ఎత్తుగా తప్పుడురి కార్డు సృష్టించి పూర్తి ఆస్తి కొన్నట్లు ప్రచారము చేయుచున్న అక్రమ చర్యలు అబద్ధమని సర్వులకు తెలియ చేయడమైనది.

**వేదగిరి పట్టాభిరామాచార్యులు**
పెద్దపుత్తేడు, శ్రీకాళహస్తి

## పబ్లిక్ నోటీసు

ఇందుమూలముగా యావన్మందికి తెలియజేయడ మేమనగా. మా కక్షిదారు శ్రీమతి యద్దల సావిత్రికి (W/o. శివయ్య), 60 అంకణముల విస్తీర్ణము గల. 2 ప్లాట్లు నెం. 19, 20 రు లను. శ్రీమతి కట్టా వెంగ సుబ్బమ్మ. W/o. లేటు వేణుగోపాల రెడ్డి. మరియు ఆమె కుమార్తె శ్రీమతి గూడూరు బుజ్జమ్మ. D/o. లేటు వేణుగోపాల రెడ్డి. అనువారలు. డాక్యుమెంటు నంబరు 123/72 లో. 11.1.1972 లో పూర్తి హక్కు. అనుభవములతో. విక్రయ పత్రము ద్వారా విక్రయించి. రిజిష్టరు చేయించి వున్నారు. సదరు ప్లాటులను. శ్రీ గంగపట్నం లక్ష్మిరెడ్డి. S/o. రామచంద్రా రెడ్డి. మరియు శ్రీమతి పిడూరు విజయమ్మ. W/o. వెంకట సుబ్బారెడ్డి. అనువారలు. తమవిగా చెప్పి. యితరులకు అమ్ముటకు ప్రయత్నించు చున్నట్లు తెలియు చున్నది. వారిరువురికీ ఆ రెండు ప్లాట్ల పై. ఎటువంటి హక్కు లేదు. కావున అటువంటి విక్రయాలు చెల్లనేరవు.

హద్దులు: తూర్పు: రోడ్డు. దక్షిణం: శ్రీ బిరదవోలు దశరథ రామ రెడ్డి యొక్క 18 నంబరు ప్లాటు. పడమర: గూడూరు బుజ్జమ్మ గారికు 11,12 నంబరు ప్లాట్లున్నూ. వాటికి పడమరన, కొత్తపాళెం రోడ్డుకు సరిగ్గా దక్షిణంగా (నేరుగా) వీరు వదలిన 40 అం. వెడల్పు రోడ్డు స్థలమున్నూ. దానికి పడమరగా. పిండిమిల్లు ఓనరు శ్రీ దాసరి సుబ్బరామయ్య యిల్లున్ను. ఉత్తరము: గూడూరు to దుగ్గరాజ పట్నం రోడ్డు.

డి. వెంకటేశ్వర రావు
గూడూరు అడ్వోకేటు

# శివారెడ్డి పద్యాలు

### మాగుంట

కోట్లు కోట్లు తెచ్చి క్రుమ్మరించేసావు
మొన్న జరిగిపోయిన ఎన్నికల్లో
నీకు ఎంత గానో జాతి కాంగ్రెస్ పార్టీ
నిజము బయట బెడితె విస్ఫోరమ్ము!

నోరు గెలుపులేంది. నోరమ్ము గెలవచ్చు
దైవ నిర్ణయాన్ని దాటగారు
మంచి పెద్ద రెండు మంచేతిలో లేవు
పాలిటిక్సు తమకు ప్రతిది తెలుసు!

నీదు త్యాగమేరు నీ నీతి నిష్టేరు
లక్షలాది గలరు లాకియర్లు
చూడమున్నదైంది సృష్టి వైచిత్రమ్ము
అది దురూహ్యం మనకు అర్థం కాదు!

యిచ్చి పిచ్చి కవిని ఏదేదో వ్రాస్తుంట
పొర బట్టుతుంట పత్రికల్లో
కళ్ల గప్పురాను కాంగ్రెసు మాటెత్త
యెగిరి గంతులేస్త ఎప్పుడింత!

### తోటాకు గోంగూర

నాటు పురము కవికి తోటాకు పంపారు
ఇంతగర్వు. తృప్తి యెంతవరకు!
గోపాలయ్య! నెట్సు గోంగూర బంపించు
యింత మాత్రమెవరు. యీ దినాల్లో

## సణుగుడు

( 4 పేజి తరువ )

తింటున్నారు. దురదృష్ట మేమిటంటె మన దిన పత్రికల యజమానులూ సాయి భక్త పరమాణువులు. తమ పత్రికలో ప్రతివారం. ప్రతి దినం సాయి సందేశాలను మూఢ భక్తిని ప్రేరేపించే కథలను ప్రచురించే పత్రికలలో బాబా గురించి వెలికి వస్తున్న వాస్తవాలు ప్రచురితమౌతాయను

కోవడం భ్రమ. అయినా విలేఖరులు తమ ప్రయత్నం తాము చేస్తున్నారు. అంత వరకు వారిని అభినందించాలి!

ఈ ఘోర దుర్ఘటనలో ప్రథమ సందేహం - సాయిబాబా గదిలో బందీలుగా చిక్కిన వారిని పోలీసులెందుకు చంపారు అన్నది. సాయిబాబాయే వారిని కాల్చిపారేయమని ఆదేశించాడని ఒక వదంతి పుడితే. సాయిబాబా సోదరుడు జానకి రామయ్య వారిని చంపాడని ఇంకొక పుకారు. పోలీసులు మాత్రం ఏ సమాధానమూ చెప్పడం లేదు. అంతకంటె దిగ్భ్రమగొల్పే విషయం- హత్యాపథకంతో వచ్చిన దుండగులు నలుగురు కాదు, ముగ్గురేనన్నది. సాయిరాం అనే యువకుడు ఆ దుండగులను ప్రతిఘటించిన వారిలో ఒకడట. ఎదురు తిరిగే సరికి ఆత్మరక్షణ కోసం కాల్పులు జరిపామన్న పోలీసు వాదన నిజమైతే ఇతడ్ని ఎందుకు చంపారు? దుండగులతో గంటకు పైగా ఒంటరిగా గడిపిన సాయిరాం వారి పథకానికి కారణాలేవో తెలుసుకొని వుంటాడనే భయంతో నిరపరాధి అయినప్పటికీ చంపించివేశారా?

ఇంతటి ఘోరాలు జరిగిన తర్వాత కూడా సత్యసాయిబాబా అసలేమీ జరగనట్లు ప్రవర్తించడమేమిటి? బాబాను చంపడానికి కుట్ర జరిగిందని ఏడుస్తూ చెప్పిన ఆయన తమ్ముడు ప్లేటు ఫిరాయించి బాబాకు ఇందులో ఏ సంబంధ మూ లేదని ప్రకటించడమేమిటి? మధ్యలో ఏమి గోల్మాల్ జరిగింది? ఎవర్ని ఎవరు రక్షించ జూస్తున్నారు. ప్రశాంతి నిలయంలో ప్రశాంతత నిజంగా వుందా? నేర పరమైన కార్యక్రమాలేవైనా జరుగుతున్నాయా? వారిదగ్గరున్న అపార ధనరాశులు ఎక్కడినుంచి వచ్చాయి? ఎక్కడ ఖర్చు అవుతున్నాయి? బాంబులు, రివాల్వర్లు, కత్తులు, సైరన్లు, సెర్చిలైట్లతో వారికేమి పని? ఈ ప్రశ్నలకు సమాధానం చెప్పేదెవరు? బాబాలు, అమ్మలు ఆజ్ఞాపిస్తే ఇటువంటి నీచ దృక్పథం కల్గిన నాయకులు రేపు దేశాన్ని తాకట్టు పెట్టుకోవడానికి వెనుదీయరన్న భయం కల్గుతున్నది.

అంతర్జాతీయ ప్రాధాన్యత వచ్చిన ఈ నేరం విషయంలో కేంద్ర, రాష్ట్ర హోం మంత్రులు సిగ్గు విడిచి, ప్రజాస్వామ్యాన్ని దారుణంగా ఖూనీచేసి పట్టికగా పచ్చిగా నేరాన్ని, దర్యాప్తును పెడదారి పట్టించడానికి ప్రయత్నం చేయడం చూస్తుంటె కడుపు మండిపోతున్నది.

## జిల్లావార్తలు

( 2 పేజి తరువ )

పెంచలకోన, భైరవకోనలు చాలా దూరం. అందులోనూ అక్కడ నక్సలైట్లు మకాం పెట్టి వున్నారన్న ఖ్యాతి ఏర్పడివుంది. మైపాడు బీచ్‌ను అభివృద్ధి చేస్తే పట్టణ యాంత్రికతతో విసిగిపోయివున్న టౌన్ పౌరులకు కొంతైనా రిలీఫ్ కన్పిస్తుంది. అక్కడ నాలుగైదు శుభ్రమైన గదులు, మంచినీటి వసతి, సముద్రతీరంలో చిన్నచిన్న రిపేర్లు, రోడ్డు సౌకర్యం కల్పిస్తే జనం వందల సంఖ్యలో విహార యాత్రకు వస్తారు. రాయలసీమ నుంచి కూడా టూరిస్టులు వస్తారు. తీరం కళ కళ లాడుతుంది. ఒక్క నాయకుడికీ ఆ దృష్టిలేదు; ఆసక్తి అసలే లేదు; కనీసం ప్రైవేటు వ్యక్తులకైనా ఆ తీరంలో కొంత భూమి కేటాయిస్తే మద్రాసు విజిపి వంటి విహార కేంద్రంగా తీర్చిదిద్దుతారు కదా?

## కావలిలో ఐ.ఎం.ఎ. సదస్సు

నెల్లూరు, కడప, అనంతపూర్, చిత్తూరు, కర్నూలు జిల్లాల ఇండియన్ మెడికల్ అసోసియేషన్ సభ్యుల ప్రాంతీయ సదస్సు 6 తేది కావలి రాధాకృష్ణ కళ్యాణ మండపంలో ఘనంగా జరిగింది. జిల్లా వైద్యాధికారి శ్రీ జి.సి. నారాయణ శిబిరాన్ని ప్రారంభించారు. కందుకూరు డాక్టర్ వి. శివకుమార్ రెడ్డి లిత్రో స్కోప్ ద్వార రాళ్లు ఆపరేషన్లు చేసే ప్రక్రియను వీడియో ప్రదర్శన ద్వారా చూపారు. నెల్లూరు అపోలో హాస్పిటల్ మధుమేహ వ్యాధి నిపుణులు డాక్టర్ రంగారావు వ్యాధి తీవ్రత తగ్గించే అంశాలు, డాక్టర్ విజయ సారథి రహదారి ప్రయాణాల్లో రోగి ప్రాణాలు రక్షించేందుకు పాటించ వలసిన పద్ధతులు వివరించారు. అనంతపూర్ డాక్టర్ వై. శ్రీనాథ్ చెవి రంధ్రాలను పూడ్చేందుకు ఆధునిక చికిత్స అయిన టెంపనో ప్లాస్టిక్‌ను పరిచయం చేసారు. కావలి ఐ.ఎం.ఎ. స్థాపకులు డాక్టర్ శంకర శాస్త్రి, వెంకట్రామయ్యలను ఘనంగా సన్మానించారు. సదస్సులో 60 మందికి పైగా డాక్టర్లు పాల్గొన్నారు. నెల్లూరు అపోలో హాస్పిటల్, మందుల కంపెనీ సిప్లా స్థాయికి తగ్గట్టు అతిథి సత్కార కార్యక్రమం ఏర్పాటు చేసింది.

## రామతీర్థం తిరునాళ్లు

విడవలూరు మండలం రామతీర్థం గ్రామం లోని రామలింగేశ్వర స్వామి బ్రహ్మోత్సవ కార్యక్రమాలు 11 తేది నుండి జరుగుతున్నాయి. 19 తేది స్వామి వారి కళ్యాణం, 20 తేది సముద్ర స్నానాలు. ఆదివారం అమావాస్య కావడం వల్ల విశేష సంఖ్యలో భక్తులు హాజరవుతారని అంచనా.

## బోగోలు పంచాయితీలో నిధుల స్వాహా ఫిర్యాదు

బోగోలు పంచాయితీ సర్పంచ్, జవహర్ రోజ్‌గార్ పథకం క్రింద మంజూరైన 12 లక్షల రూపాయల నిధులను దుర్వినియోగం చేస్తున్నారని ఏడుగురు పంచాయితీ సభ్యులు ఫిర్యాదు చేస్తున్నారు. గ్రామానికి 12 లక్షల నిధులు వచ్చా[illegible] ఏవి [illegible] చేస్తున్నారో. [illegible] వారు[illegible] చేస్తున్నారో కనీసం సభ్యులకు కూడా వివరాలు తెలియవు. పంచాయితీ మీటింగులలో ఓచర్లు, బిల్లులు చూపడం లేదు. మూడేళ్ల నుంచి క్యాష్ బుక్ కూడా చూపలేదట. వచ్చిన 12 లక్షలలో సగం కూడా ఖర్చు పెట్టినట్లు తాము భావించడం లేదని, అందువల్ల కలెక్టర్ గారు తక్షణం దీని పై విచారణ జరిపించాలని మాజీ ఉప సర్పంచ్ శ్రీ టి. ప్యాట్రిక్ కోరుతున్నారు.

## కృష్ణపట్నం థర్మల్ స్టేషన్ వివరం చెప్పాలి!

కృష్ణపట్నం థర్మల్ స్టేషన్ నిర్మాణం పై ప్రభుత్వం ఒక స్పష్టమైన ప్రకటన చేయాలని ఆ పరిసర గ్రామాల ప్రజలు కోరుతున్నారు. థర్మల్ స్టేషన్ పరిధిలో కొన్ని వందల ఎకరాల ప్రైవేటు భూమి వుంది. అదంతా రొయ్యల పెంపకానికి పనికి వచ్చే భూమి. ఆ పెంపకం ఇప్పుడెంత లాభసాటిగా వుందో, ఆ భూముల విలువ ఎంత అనూహ్యంగా పెరిగిపోయిందో చెప్పలేము.

థర్మల్ స్టేషన్ నిర్మాణం నిజంగా జరుగుతుందా. జరిగితే ఎప్పుడు? వెంటనే భూములు స్వాధీనం చేసుకుంటారా? లేక రెండు మూడేళ్ల కాల వ్యవధి వుందా? వంటి అంశాల పై ప్రభుత్వం స్పష్టమైన ప్రకటన చేస్తే రైతులు ఆ ప్రకారం తమ భూములను వుపయోగ పెట్టుకొంటారు. వెంటనే స్వాధీనం చేసుకొనే పక్షంలో వాటి పై లక్షలు పెట్టుబడి పెట్టి రొయ్యల చెరువులు నిర్మించడం దండగ; చెరువులు నిర్మాణమైన తర్వాత భూమి ధరకు స్వాధీనం చేయాలని వత్తిడి తెస్తే రైతులలో విపరీతమైన అలజడి వస్తుంది. అధికారులు ఈ పరిస్థితి గమనించి ముందుగానే జాగ్రత్త పడితే వారికి మంచిది, రైతుకు నష్టం వుండదు.

## పంచాంగం

### ఆర్ద్ర కార్తె

22 తేది మంగళవారం ఆర్ద్ర కార్తె ప్రారంభం.
21తేది సోమవారం నుండి ఆషాఢ మాసము శూన్యమాసము

### జూన్ తిథులు

జ్యేష్ట బహుళ
తే 19 శని చతుర్దశి ఉ. 7.20 వ
తే 20 ఆదిఅమావాస సా. .7.00 వ
ఆషాఢ శుద్ధ
తే 21సోమ పాడ్యమి ఉ .6.20 వ
తరువాత పూర్తిగా విదియ
తే 22మంగళ తదియ రా .3.55 వ
తే 23బుధ చతుర్థి రా. 1.50 వ
తే 24గురు పంచమి రా. 11.40 వ
తే 25శుక్ర షష్టి రా . 9.30 వ

స్వయంపాకుల శ్రీనివాసులు
ఎం.ఏ

### నీటిమట్టం

| | |
|---|---|
| నెల్లూరు చెరువు | 10.8అ |
| సర్వేపల్లి రిజర్వాయరు | 1.6అ |
| కనిగిరి రిజర్వాయరు | 11.5 అ |

### నెల్లూరులో ఎండ

| | |
|---|---|
| 13 తేది | 101.1 |
| 14 తేది | 97.5 |
| 15 తేది | 97.3 |
| 16 తేది | 99.5 |
| 17 తేది | 102.7 |

### నెల్లూరు బజారు

| | |
|---|---|
| మొలగొలుకులు | |
| 9672 (పాతవి) | 4,000/- |
| 9672 (కొత్తవి) | 3,400/- |
| 9674 (కొత్తవి) | 3,600/- |
| ఐ.ఆర్. 20 | 2,800/- |
| బియ్యం బస్తా (70 కిజిలు) | 550/- |
| బియ్యం (కిజి) | 8/- |
| బంగారు సవర (8 గ్రా) | 3,400/- |
| వెండి (10 గ్రా) | 65/- |
| పెసలు (100 కిలోలు) | 950/- |
| వేరుశెనగ నూనె (కిజి) | 30.50/- |
| మిరపకాయలు (కిజి) | 20/- |
| చింతపండు (కిజి) | 20/- |
| చక్కెర (కిజి) | 10.50/- |
| బెల్లం (కిజి) | 16/- |
| కందిపప్పు (కిజి) | 19/- |
| పెసర పప్పు (కిజి) | 16/- |
| మినప పప్పు (కిజి) | 12/- |

## ప్రజాదరణ చూస్తుంటే మళ్లీ సినిమాల పై కోరిక

**- ఎన్టీఆర్**

"నేను సినిమా రంగం నుంచి రాజకీయ రంగానికి వచ్చిన వాణ్ణి. 'మేజర్ చంద్రకాంత్' చిత్రం పట్ల ప్రజల ఆదరణ గురించి వింటూంటే నాకు చక్కని పాత్రలు ఉన్నై మరి కొంత కాలం పాటు సినిమాలలో నటించాలని వుంది. సినిమా [illegible] ' చిత్రాన్ని డైరెక్ట్ చేయడానికి ఎప్పుడో కమిట్ అయ్యాను. ఆ చిత్రానికి నేషనల్ ఫిలిమ్ డెవలప్‌మెంట్ కార్పొరేషన్ ఋణాన్ని మంజూరు చేసింది కూడా. ఆ బాధ్యతను పూర్తి చేశాక నేను సినిమా రంగం నుంచి పూర్తిగా విశ్రమిస్తాను. ఈలోగా చిత్రాలకి అంతగా ఆదరణ లేనప్పుడు కొత్త నటీ నటులతో కొత్త నిర్మాతలు తీసే చిత్రాలకు ఆదరణ ఎలా వుంటుంది? కాని, సినిమా వ్యామోహం ఉన్న యువతరం బలహీనతలను ఆసరాగా తీసుకొని ఇటీవల బోగస్ కంపెనీలు అనేకం వెలిశాయి. ఎక్కడో

## రెండు పడవల సవారీ నష్టదాయకమని నిష్క్రమణకే నిర్ణయం

**- జమున**

నాకు తల్లిలాంటిది'' అని ఎన్టీఆర్ అంటే, జమున "సినిమా రంగంలో వుంటూ రాజకీయ రంగంలో కృషి చేయడం కష్టమే. రెండు పడవల మీద సవారీ మంచిది కాదు. అందుకే నేను సినిమా రంగం నుంచి తప్పుకోవడానికి నిశ్చయించాను. ఐతే, నేను 'డాక్టర్ మద్యపాన వ్యాపారాన్ని సాగిస్తున్న నాయకులే స్వతహాగా దుకాణాలు మూసి విషయమై సాహసోపేతంగా పోరాడుతాను'' అని తెలియజేశారు.

### బోగస్ కంపెనీలు

పేరున్న తారలతో అనుభవజ్ఞులైన నిర్మాతలు తీస్తున్న ఔట్‌డోర్ షూటింగ్ జరుగుతున్నప్పుడు అక్కడ తారలతోపాటు [illegible] ఫోటోలు తీయించుకోవడం, ఆ తర్వాత ఆ ఫోటోలతో అమాయకులను మోసం చేయడం. ఆ మధ్య హైదరాబాదులో "ఇదండీ మావారి వరస'' షూటింగ్

కొరవ 10 పేజీలో

## ఆ పదిహేను లక్షలుంటే వడ్డీ రాదా?

తన పారితోషికం 15 లక్షలు అని నటి రోజా చెప్పేసరికి ఒక నిర్మాతకు కల్గిన గాభరా ఇంతా ఇంతా కాదు. ఆమెకే పదిహేను లక్షలైతే, ఆ చిత్రం పూర్తి చేయడానికి కోటి వరకు దాటొచ్చు. ఆ పెట్టుబడి మీద లాభమొస్తుందన్న నమ్మకం ఏమిటి? హాయిగా ఆ 15 లక్షలనూ ఏ బ్యాంక్ లోనో వేస్తే వడ్డీ అయినా గ్యారంటీగా వస్తుంది. ఇంత ఆయాసపడి సినిమా తీయడమెందుకు? అని తలపోసి బుద్ధిగా అసలు సినిమా తీయాలన్న ఆలోచనకే తిలోదకాలిచ్చేసి చక్కా తన స్వగ్రామానికి చేరుకున్నాడట. బతికి పోయాడు!

## సురేష్ అధినేత శరణాలయం

నిర్మాత డి. రామానాయుడు వితరణశీలి. ఈయన అనాధులు, వయోవృద్ధులు, వికలాంగుల కోసం హైదరాబాద్‌కు 64 కి.మీ దూరంలో నర్సాపూర్ ప్రాంతంలో సువిశాలమైన ఒక ప్రదేశంలో అనాథ శరణాలయాన్ని నిర్మించ బోతున్నట్లు తెలిపారు. అంతే కాక, తన సురేష్ సంస్థలో ఏళ్ల తరబడి పని చేస్తున్న ఉద్యోగుల గృహ వసతికి గాను ఫిలిం నగర్ ప్రాంతంలో 15 ఎకరాల స్థలాన్ని ఖరీదు చేయనున్నారు.

ఈయన న్యూయార్క్‌లో జరిగే తెలుగు మహాసభల కోసం నిర్మిస్తున్న వీడియో చిత్రం "ఆంధ్ర వైభవం'' లో ఒక పాటలో అక్కినేని, చిరంజీవి, నాగార్జున, వెంకటేశ్‌తో పాటు ఎన్టిఆర్ కూడా నటించవచ్చు.

## రౌడీ చిత్రాల సీజను

ఆ మధ్య కొంత కాలం "మొగుడు'' తర్వాత "పెళ్లాం'' ఉన్న టైటిల్స్ విపరీతంగా వచ్చాయి. ఇప్పుడు "రౌడీ'' సీజన్ రాజ్యమేలుతున్నట్లుంది.

"రౌడీ రాజకీయం'' చిత్రంలో భానుచందర్, చంద్రమోహన్, జయసుధ, ఆమని, అంజలి, డిస్కో శాంతి వగైరా నటవర్గం. కథ, స్క్రీన్‌ప్లే, దర్శకత్వం: వి.బి.ఎల్. ప్రసాద్, పాటలు: వెన్నెలకంటి, సంగీతం: బప్పీలహరి.

"రౌడీ టీచర్'' లో నరేష్, శోభన, జయప్రద ఆదిగా గలవారు నటించారు. దర్శకత్వం: ఓంకార్.

"రౌడీ అన్నయ్య, రౌడీ కిల్లర్, రౌడీ ఎం.ఎల్.ఎ., రౌడీ మొగుడు'' పేర్లతో మరి కొన్ని చిత్రాలు తయారవుతున్నాయి. సినిమా కథలు దాదాపు ఒకే లాగున ఉంటున్నాయి. సినిమా పేరు కూడా మూస పోసినట్లు ఉంటె ఎలా? అందుకే సినిమాలంటె ప్రేక్షకులకు అయోమయంగా వుంటుంది.

## మని: ప్రేక్షకుల చెవిలో పువ్వు!

ఏదో కొత్త దనం చూపించాలన్న తపన, చూపించ లేక పోయిన దర్శక, నిర్మాతల అసహాయత 'మనీ' చిత్రంలో స్పష్టంగా కనపడతాయి. చిత్రాన్ని కామెడీ, క్రైమ్, సస్పెన్స్, కుటుంబ కథా క్రమాల్లో ఏ కోవకు చెందుతుందో వర్గీకరించడం కష్టమే. కారణం కథలో పసలేక పోవడమే. అందుకే రీళ్లు నింపడం కోసం పలు నసలు జొప్పించారు. కథానాయికి జయసుధ, నిర్మాతగా రూపాంతరం చెందిన దర్శకుడు రామ్‌గోపాల్ వర్మ, పాటల రచయిత సీతారామశాస్త్రి గాయకులై ప్రేక్షకుల పై తమకున్న కసిని తీర్చుకున్నారా అనిపిస్తుంది ఆ పాటలు వింటూంటే. ఎత్తుపల్లాల్లో పడిన కథాగమనం సరి చేసేందుకు పెట్టిన పాటలు మరింత విసుగు పుట్టించాయి. ఇంటి ప్రక్కన వుండే వ్యక్తులే కిడ్నాప్ చేస్తే వారిని కిడ్నాప్ అయిన వ్యక్తి గుర్తించక పోవడం వంటి ప్రధాన బలహీన సన్నివేశంతో ప్రేక్షకుల చెవులో పువ్వు పెట్టే ప్రయత్నం చేసారు. అయితే నటుడు తప్ప అతడు ధరించిన పాత్ర కనపడని ఈ రోజుల్లోని సినిమాలలో పాత్రల్లో కనిపించే నటులను చూడవచ్చు. దాదా గెటప్ వంటి వెరైటీ గెటప్‌లో బ్రహ్మానందం జీవించినా, బ్రేక్ డ్యాన్స్‌లో మాత్రం బాబూమోహన్‌ను అధిక మించలేక పోయారు. ఓ మోస్తరు

**చిత్రసమీక్ష**
★ ★ ★ ★
**అల్లూరు రహీం**

హాస్యం, చూడ చక్కనైన కెమెరా పనితనం, శ్రావ్యమైన నేపథ్య సంగీతం ఒకసారి సినిమాను చూసేలా చేస్తాయి. కథ, స్క్రీన్‌ప్లే, దర్శక శాఖలను యువకుడు శివనాగేశ్వర రావు నిర్వహించినా చిత్రీకరణ బాణంతా రామగోపాల్ వర్మ సినిమాలలో అనుకరణ సాగింది.

ఇక కథలోకి వస్తే అన్తంతా విజయ (జయసుధ) పేరన వుండడం వల్ల వ్యసన పరుడైన ఆమె భర్త సుబ్బారావు (హరీష్ రావెల్) డబ్బు కోసం తెగ ఇబ్బంది పడి పోతుంటాడు. వీరింటి పక్క దాబా పై బాడుగకు వుండే నిరుద్యోగులు బోసు (చిన్నా), చక్రి (చక్రవర్తి) వుద్యోగాలు రాక రెంట్, మెస్ బిల్ చెల్లించను సతమతమై పోతుంటారు. దీనికి తోడు బోసు పెళ్లి చేసుకోనంటే చనిపోతా నని బెదరించే ఓనర్ కూతురు రేణుక (రేణుక సహాని)

ఈ దశలో డబ్బు తేలికగా సంపాదించను కిడ్నాప్ ప్రక్రియే సరైన సాధనమని భావిస్తారు బోసు చక్రి. తమ టార్గెట్‌గా లక్షాధికారి విజయను ఎన్నుకొంటారు. ఆస్తి తన సొంతం కావడం కోసం విజయను చంపను అప్పటికే ప్రొఫెషనల్ కిల్లర్ (బిక్షు) ను ప్రయోగించి విఫలమైన సుబ్బారావు స్వయంగా ఆమెను చంపాలని

కొరవ 10 పేజీలో



పౌరుషం చిత్రంలో మాలశ్రీ

## కిరాయి గూండాకు మోక్షం

ఆ మధ్య హీరో కృష్ణ టైమ్ బాగో లేనప్పుడు ఆయన చిత్రాలు అయిదారు విడుదలకు నోచుకోలేక పోయాయి. ఇటీవల ఆ గ్రహణం తొలగి పోయి ఆయన చిత్రాలు రెండు విజయవంత మయ్యేసరికి ఆయన పాత చిత్రాలు ఒక్కొక్కటిగా గట్టెక్కుతున్నాయి. ఎప్పుడో మూడేళ్ల క్రితం తయారైన రాజ్యలక్ష్మి మూవీస్ "కిరాయి గుండా'' చిత్రానికి ఇటీవల మోక్షం వచ్చింది. ఇందులో కృష్ణ, భానుప్రియ, రమ్యకృష్ణ, నూతన్ ప్రసాద్, గొల్లపూడి మారుతి రావు, సుధాకర్, వై. విజయ, ప్రదీప్ శక్తి, ఏలేశ్వరం రంగా, చిడతల అప్పారావు నటించారు. మాటలు: సత్యానంద్, పాటలు: వెటూరి, సంగీతం: రాజ్-కోటి, నిర్మాత: అంగర సత్యం, దర్శకత్వం: ఎస్.ఎస్. రవిచంద్ర.

## మళ్ళీ జానపద చిత్రాలు

చందమామ విజయ కంబైన్స్ "భైరవ ద్వీపం'' చిత్రానికి ఎంత భారీ ఎత్తున ప్రారంభోత్సవం జరిగిందంటే, నలుగురైదుగురు నిర్మాతలు జానపద కథల కోసం అన్వేషించడం మొదలెట్టారు. భూమి గుండ్రంగా ఉందంటే ఇదేనేమో మరి!

### పి.సి. రెడ్డి దర్శకత్వంలో కృష్ణంరాజు, జయసుధ

చక్కని కుటుంబ గాథలను తెరకెక్కించడంలో నెల్లూరీయుడు పి. చంద్రశేఖర రెడ్డి దిట్ట అన్న విషయం ఆయన రూపొందించిన ఎన్నో చిత్రాలు గతంలో నిరూపించాయి. ఈయన దర్శకత్వంలో పి. కవిత నిర్మిస్తున్న అనూరాధ ఫిలిమ్స్ డివిజన్ తాజా చిత్రంలో కృష్ణంరాజు, జయసుధ, అంజలీ దేవి, బ్రహ్మానందం, భరత్, బాబూ మోహన్ ఆదిగా గలవారు పాల్గొంటున్నారు. కథ, స్క్రీన్‌ప్లే, మాటలు: డి.వి. నరసరాజు, సంగీతం: ఎం. విశ్వనాథం, ఛాయ: సుధాకర్ రెడ్డి. ఈ చిత్రం ద్వారా నవ్య అనే నవ కథానాయిక [illegible] గా పరిచయం బడుతుంది.

## నెల్లూరు జిల్లా జడ్జి వారి కోర్టులో

O.P. No. 62 / 93

**In the matter of estate of deseased pendayam china pendalaiah**

దార్ల వాగరూపమ్మ -పిటీషనరు

Vs

లేరు -రెస్పాండెంట్లు

### జనరల్ నోటీసు

పై పిటీషనరు చనిపోయిన తన తమ్ముడు పెంద్యం చిన పెంచలయ్యకు సంబంధించిన డబ్బు తీసుకొనుటకు వారసురాలనని కోరుతూ పై పిటీషన్ కోర్టులో దాఖలు చేసినది సదరు పిటీషన్ తేది 28.6.93 వాయిదా వేశ యున్నది. యెవ్వరికైనా ఎమైనా ఆక్షేపణ ఉన్న 28.6.93 తేది ఉదయం 10.30 గంటలకు పై కోర్టులో హాజరై తెలుపు కోవలసి యున్నది.

**యమ్. కామేశ్వర రావు**
ఆత్మకూరు, నెల్లూరు జిల్లా

## నెల్లూరు సబ్ జడ్జి వారి కోర్టులో

E.P. No. 33 of 1988 in
O.S. No. 610/1987

శ్రీ మూలస్థానేశ్వర స్వామి దేవస్థానం సర్వేపల్లి రిప్రజెంటెడ్ బై ది E.O.
-డిక్రీ హోల్డరు

Vs

1) పైలారి పెంచలయ్య.
2) తుమ్మలాటి రమణయ్య
3) పైలారి పిచ్చయ్య
- జడ్జిమెంటు డెటార్సు

### వేలం ప్రకటన

షెడ్యూలు దాఖలా ప్రతివాదుల ఆస్తిని డిక్రీ హోల్డరు బాకీ రాబట్టుకొనుటకు గాను 24.6.93 తేది గురువారము ఉదయము 10 గంటలకు ఇస్కపాళెం గ్రామంలో శ్రీ కోదండ రామ స్వామి దేవస్థానము వద్ద నాచే వేలము వేయబడును. పాటలో పాల్గొన దలచిన వారు ముందుగా నా వద్ద వివరములు తెలుసుకొన వచ్చును. డిక్రీ హోల్డరుకు పాటలో పాల్గొనుటకు కోర్టు వారు పర్మిషను కూడా యిచ్చి యున్నారు.

### షెడ్యూలు

నెల్లూరు డి.రి. ముత్తుకూరు సబ్. రి. ఏరియాలోని ఇస్కపాళెం గ్రామం సర్వేపల్లి బిట్ 3 లో చేరిన మాగాణి పొలము యొక్క వివరములు.

లాటు పట్టా సర్వే విస్తీర్ణం D.H.R. అమినా
నెం. నెం. నెం. ఎ.సెం. విలువ విలువ రూ.

186 1061/C-1 1.07 10,000/- 16,050/-

పూర్తి విస్తీర్ణం కలవి

**కె. అనంత సత్యనారాయణ**
Advocate/Commissioner



ఢిల్లీ తెలుగు అకాడమీ తరపున ప్రఖ్యాత హరికథకుడు పునుగు శేషయ్య శాస్త్రిని సన్మానిస్తున్న రాష్ట్ర విద్యామంత్రి పాటిరాజం; కార్యదర్శి ఎన్‌విఎల్ నాగరాజు

## జనవాణి

(3 పేజీ కొరవ)

నవ్వు తెప్పిస్తున్నాయి. జాతిని నడప వలసిన నేతలు ఇలా ఎందుకు తప్పటడుగు లేస్తున్నారో అర్థం కావడం లేదు. కొందరు నాయకులు నిరంతరం అధికారం కోసం ఎక్కడో మంచె పై కూర్చొని వుంటే ఒక బాబా చేత నెత్తి పై కాలితో తన్నించుకొని పరువు పోగొట్టు కున్నారు. మరి కొందరికి స్మగ్లర్ స్వామితో సంబంధాలు. మన ప్రధాన మంత్రి, హోం మంత్రి, ముఖ్యమంత్రుల వైఖర్లు ఇటీవల సత్యసాయి బాబా పై దాడి జరిగిన తరువాత తెలిసాయి. పనులన్నీ వదలి పెట్టి హోం మంత్రి వానలో తడుస్తూ మరీ వచ్చి బాబాకు సాష్టాంగ పడి పోయారు. అదే ఉత్సుకత అయోధ్య విషయంలో ఆయన చూపలేక పోయారు. ముఖ్యమంత్రి కూడా ఇదే ధోరణిలో సాగారు. ప్రతి ఒక్క ఓటరూ ఓటు విలువ తెలుసుకొనేంత వరకు జాతికి ఇటువంటి నేతలు తప్పరు.

నెల్లూరు -ఉప్పలపాటి రవి

### మురికి కూపంగా ఎ.సి.నగర్

ఎ.సి.నగర్‌లో డ్రైనేజి సిస్టం సరిగా లేనందువల్ల రోడ్లంతా మురికి నీళ్లు నిలబడి వున్నాయి కాసింత వర్షం పడితే చాలు, డ్రైనేజి నీళ్లన్నీ ఇండ్లలో వుంటాయి. ఒక వైపు దోమ పోటు, మరో వైపు కరెంట్ కోత. ఈ విషయాలను ఎన్నిసార్లు ఎసినగర్, బాలాజీ నగర్ వాసులు అధికార్లకు విన్నవించినా చెవిటి వారి ముందు శంఖం వూదినట్లుంది.

నెల్లూరు -సత్యస్వరూప్

### ప్రశాంతి నిలయమా? అశాంతి వలయమా?

పుట్టపర్తి సాయిబాబా పై హత్యాయత్నం జరగడం శోచనీయమే. కానీ తరువాత వినిపిస్తున్న పరస్పర ప్రకటనలు అనుమానాలకు దారి తీస్తున్నాయి. హత్యా యత్నం చేసినారని చెప్ప బడుతున్న వ్యక్తులు ఆశ్రమంలో సంవత్సరాల తరబడి బాబా భక్తులుగా కొనసాగుతున్న వారే. వాళ్లు ప్రయత్నం చేయడానికి రాగానే బాబా ప్రక్క రూంలోకి వెళ్లి తలుపులు బిగాయించు కోవడం, సైరన్లు మ్రోగించడం, చాలా సేపటికి వచ్చిన పోలీసులు అప్పనంగా దొరికిన నిందితుల్ని ప్రాణాల్తో పట్టుకోనక ఆత్మ రక్షణ పేరుతో కాల్చి చంపడం వెనుక ఎన్నెన్నో అనుమానాలు?

అధికారం కోసం పెనుగులాటలో అన్నదమ్ములు పోటికి దిగుతున్న ప్రస్తుత మన భారత సమాజంలో సాయిబాబా ట్రస్టుకు వారసత్వానికై జరిగిన పోటీలో బాబా పై హత్యా యత్నానికి పూనుకొన్నారని ఒక వాదం. ఈ విషయంలో బాబా ఎందుకు నోరు విప్పి చెప్పడం లేదో అర్థం కావడం లేదు. చివరకు హత్యాయత్నం వార్త అబద్ధమనే స్థితికి ప్రశాంతి నిలయం అంత రంగికులు వచ్చారంటే ఎవరెవరి హస్తాలు ఇందులో వున్నాయో ఊహ కందడం లేదు. భక్తి పారవశ్యాలతో, స్తోత్ర గీతాలతో, ఆధ్యాత్మిక కార్యక్రమాలతో సుందర నందనంగా విలసిల్లుతున్న ప్రశాంతి నిలయంలో డిటనేటర్లు, సైనేడ్ సీసాలు స్థానం పొందాయంటే పరిస్థితి ఎంత మారి పోయిందో అర్థమౌతుంది. ప్రస్తుతం అక్కడ భక్తులు వుండడానికి కూడా సాహసించడం లేదు.

ఈ విషయాన్ని తేల్చకుండా వదిలేస్తే ముమ్ముందు ఎన్ని అవాంతరాలు జరుగుతాయో? మొత్తం మీద ప్రశాంతి నిలయం అశాంతి వలయంగా మారిపోయింది. బాబాను విచారించ మంటూ ప్రభుత్వ ప్రకటన వెలువడం శోచనీయం. బాబాను విచారిస్తే గాని అసలు విషయాలు బయట పడవు సుమా.

నెల్లూరు -ఐ.వి. రఘురామ మూర్తి

## చిత్రసమీక్ష

(9వ పేజీ కొరవ)

నిర్ణయించుకున్న క్షణంలోనే కిడ్నాప్ చేస్తారు బోస్, చక్రి.

అక్కడి నుండి వారికి కష్టాలు ప్రారంభమ వుతాయి. కిడ్నాపర్లు కోరిన మొత్తంలో డబ్బును విజయ భర్త సుబ్బారావు ఇవ్వక పోగా ఆమెను చంపెయ్యమని సలహా ఇస్తాడు. దీంతో ఖంగుతిన్న బోస్, చక్రిలు ఈ విషయాన్ని విజయకు తెలియజేసి, క్షమాపణలు కోరుతారు. భర్త కపట పన్నాగం ఛేదించను బోస్, చక్రి, రేణుక, కృష్ణారావులతో కలసి విజయ ఆడిన నాటకంలో భార్య నిజంగానే చనిపోయిందని భావించిన సుబ్బారావు రాష్ట్రం వదలి పారిపోతాడు. విజయ, బోసు, చక్రిలను క్షమించి వుద్యోగ మిచ్చి తన వద్ద పెట్టుకోవడంతో చిత్రం ముగుస్తుంది. మధ్యలో ఖాన్ దాదాగిరి (బ్రహ్మానందం) కథ ఒకటి. మామూళ్ల వసూలు చేసుకొనే దాదాకు వున్న సినిమా పిచ్చి వుపయోగించు కొని అతన్ని మోసగిస్తాడు మాణిక్యం ( తనికెళ్ల భరణి) దీంతో అతనిని హత్యచేస్తాడు దాదా. కోట శ్రీనివాస రావు క్యారక్టర్ మరో తోక.

చిత్రంలోని చివరి సీను ప్రేక్షకుల్లో ఉత్కంఠత ఒక్కసారిగా పెంచుతుంది. పదిహేను నిమిషాల పాటు వుండే ఈ సీను చక్కగా పేలింది. అదే విధంగా బ్రహ్మానందం ప్రవేశం కూడా బాగుంది. నటీనటుల్లో జయసుధ, యువనటులు చక్రవర్తి, చిన్నా, హరీష్ రావెల్ పోటీ పడి నటించారు. అందమైన క్యాస్ట్యూమ్స్‌లో జయసుధ పాతికేళ్ల పడుచులా కనిపించింది. పదహారేళ్ల పడుచు రేణుకా సహాని హీరోయిన్‌గా పనికొస్తుంది. పబ్లిక్ టెలిఫోన్ బూత్‌లో వుండే కాదంబరి కిరణ్ కుమార్, లాయర్‌గా కళ్లు చిదంబరం క్యారక్టర్లు నవ్వు తెప్పిస్తాయి. సీతారామ శాస్త్రి రాసిన పాటల్లో 'చక్రవర్తికి వీధి బిచ్చగత్తెకు' పాటలో డబ్బు ఆవశ్యకతను నొక్కి చెప్పారు. వివిధ హిట్ల కూర్చి రాసిన పాట కూడా బాగుంది. కెమెరా మెన్ తేజ చక్కని పనితనం చూపారు. శ్రీమూర్తి సంగీతం స్టీరియో ఫోనిక్ ఎఫెక్ట్‌లో బాగుంది. కథలో పస లేక పోయినా ప్రేక్షకులు విసుగు చెందకుండేలా ఎడిటర్ శివశంకర్ శ్రమించారు.

## సినిమా

( 9 పేజీ కొరవ )

జరుగుతున్నప్పుడు రాజేష్ బాబు అనే యువకుడు వచ్చి, నరేష్, డైరక్టర్ రేలంగి నరసింహా రావుతో సరదాగా తీయించుకున్నట్లు కొన్ని ఫోటోలు తీయించుకున్నారు. ఆ తర్వాత అతనే రేలంగి- నరేష్ కాంబినేషన్‌లో "శ్రీమతి ముచ్చట్లు- శ్రీ వారి అగచాట్లు" అనే చిత్రాన్ని నిర్మిస్తున్నట్లు ఆ ఫోటోలతో ప్రకటింప చేసుకున్నాడట. అది చూసి రేలంగి నరసింహా రావు దిగ్భ్రాంతి చెందారు. కథ లేదు కమామిషు లేదు ఆ చిత్రం పేరేమిటి, తాను డైరక్ట్ చేస్తానని ఎప్పుడు మాటిచ్చాను?అని పాత్రికేయులకు ఈ విషయాన్ని తెలియజేశారు.

# నెల్లూరు సంగతులు

( 4 పేజీ తరువాయి )

## నెల్లూరులో రెడ్‌క్రాస్ కార్యాలయం

ఇండియన్ రెడ్‌క్రాస్ సొసైటీ నెల్లూరు జిల్లా శాఖ కార్యాలయం జూబిలీ ఆసుపత్రి పక్కన స్వంత భవనంలో ఇటీవల పని చేయుటం ప్రారంభించింది. ఈ సేవా సంస్థలో సభ్యులుగా చేరాలనుకొనే ఔత్సాహికులు పేర్లు నమోదు చేసుకొను సంస్థ మేనేజరు ప్రతి దినం సాయంత్రం 4 గంటల నుండి 6 గంటల లోపల అందుబాటులో వుంటారని సొసైటీ కార్యదర్శి డాక్టర్ ఎ.వి. సుబ్రహ్మణ్యం తెలుపుతున్నారు.

## అదనంగా చక్కెర పంపిణీ

జూన్‌లో ఇవ్వవలసిన చక్కెర కోటాకు జిల్లాలో నిల్వ వున్న సరకు తోడవడంతో ఈ నెలలో అదనంగా చక్కెర పంపిణీ చేస్తారు. మునిసిపల్ పట్టణాలు, పాత తాలూకా కేంద్రాలలోని రేషన్ కార్డు వినియోగ దార్లకు 6 కిలోలు, తెలుపు కార్డుల వారికి 2 కిలోలు, ఇతర ప్రాంతాలలోని రేషన్ కార్డు వారికి 4 కిలోలు, తెల్ల కార్డు వారికి కిలో చొప్పున ఇస్తున్నట్లు జాయింట్ కలెక్టర్ సతీష్ చంద్ర తెలిపారు.

## వెంకయ్య స్వామి పై టెలి ఫిల్మ్

గొలగమూడి వెంకయ్య స్వామి జీవిత చరిత్ర పై నెల్లూరులోని ఎన్.వి.ఎస్. ఆర్ట్ క్రియేషన్స్ టెలి ఫిల్మ్ రూపొందిస్తుంది. ఇప్పటికే మూలచరిత్ర ఆధారంగా స్క్రిప్ట్ వర్క్ పూర్తి చేసినట్లు నిర్మాత టి.వి. సుబ్బారావు చెప్పారు. జూలై మొదటి వారంలో పాటల రికార్డింగ్ జరిపి, రెండవ వారంలో సోమశిల, పెంచల కోన, కోటితీర్థం తదితర ప్రదేశాల్లో 15 రోజుల షెడ్యూల్‌తో షూటింగ్ పూర్తి చేస్తారట. ఆగస్టు 24 తేది వెంకయ్య స్వామి ఆరాధన మహోత్సవ కార్యక్రమంలో క్యాసెట్ విడుదల చేస్తారు. ఈ ఫిల్మ్‌లో యవ్వన దశలో స్వామిగా ఐ. అనంత రామచంద్ర మూర్తి, వృద్ధాప్యంలో డి. వీరాస్వామి నటిస్తారు. మాటలను శ్రీ ప్రకాష్, పాటలను ఎ. మల్లిఖార్జున రావు, కార్తికేయ, రామస్వామి వ్రాస్తున్నారు. సంగీతం బాబూరావు, కెమెరా కమలాకర్, దర్శకత్వం శ్రీ ప్రకాష్ విజయ కుమార్ వహిస్తారు.

## సహస్ర పూర్ణ చంద్ర దర్శనం చేసుకొన్న పౌరాణిక బ్రహ్మ

సినీ పరిశ్రమలో పౌరాణిక బ్రహ్మగా ఖ్యాతిగాంచిన శ్రీ కమలాకర కామేశ్వర రావు 83 సంవత్సరాలు పూర్తి చేసుకొన్న సందర్భంగా ఇటీవల సహస్ర పూర్ణ చంద్ర దర్శనం చేసుకొన్నారు. విశాఖ పట్నంలోని ఆయన పెద్దల్లుడు ప్రొఫెసర్ పానుగంటి వెంకట సుబ్బారావు ఈ కార్యక్రమాన్ని వైభవంగా జరిపించి తన మామ పై భక్తి భావం చూపారు. జీవితంలో వెయ్యి పౌర్ణమి చంద్రులను చూసిన వారు అరుదుగా ఈ వుత్సవం చేసుకొంటారు. ఈ వుత్సవంలోకి పౌరాణిక బ్రహ్మ నలుగురు కుమార్తెలు, అల్లుళ్లు, కొడుకు, కోడళ్లతో పాటు పలువురు అభిమానులు పాల్గొన్నారట. మద్రాసు నుండి వచ్చిన కమలాకర కామేశ్వర రావు ప్రస్తుతం నెల్లూరులో వుంటున్న విషయం పాఠకులకు విదితమే.

## నేత్రదానం

నెల్లూరు నేత్ర దాతల సంస్థ కృషి, పట్టుదల ప్రచారానికి ప్రజలు స్పందిస్తున్నారు. 1987 లో సంస్థ ఏర్పడ్డా 89 వరకు ఒకే ఒక నేత్రంతో జరిగినా తరువాత ప్రగతి పథాన సాగుతుంది. సంస్థలో సభ్యుల శ్రమ, ప్రజల ఉపకారం తోడవడంతో ఇప్పటి వరకు 16 నేత్రాల జతలను సేకరించి మద్రాస్‌లోని నేత్ర వైద్యశాల నేత్ర నిధికి సమర్పించడం జరిగింది. తాజాగా వుస్మాన్‌సాహెబ్ పేటలోని రామనగర్‌కు చెందిన, సోమిశెట్టి సుబ్బరత్నమ్మ గారి నేత్రాలను సంస్థ ఇటీవల సేకరించడం జరిగింది. జ్వరంతో బాధపడుతూ మరణించిన ఆమె నేత్రాలను ఆమె కుమార్తె సీతాలక్ష్మి, భర్త వెంకట నరసింహ రావు అందించిన సమాచారం మేరకు సంస్థ వైద్యాధికారి డాక్టర్ టి.వై. కృష్ణ అమెరికన్ ఆసుపత్రి కంటి విభాగపు వైద్యులు డాక్టర్ పి. వెంకట రత్నం వెళ్లి తీయడం జరిగింది. కేవలం 10 నిమిషాల్లో సమాచారం అందించిన దంపతులకు నేత్రదాతల సంస్థ కార్యదర్శి తిక్కవరపు సుకుమార రెడ్డి అభినందిస్తున్నారు. మనిషి పోయినా అతని నేత్రాలు సజీవంగా వుండే అవకాశమున్న నేత్రదాన ప్రక్రియకు అందరూ చేయూత నివ్వాలి.

## వినియోగదార్ల సంఘాల సమాఖ్య ఏర్పాటు

వినియోగదార్ల వుద్యమాన్ని మరింత పటిష్ట పరిచేందుకు జిల్లాలోని వినియోగదార్ల సంఘాలన్నీ ఏకమై 12 తేది సమాఖ్యగా రూపాంతరం చెందింది. ఈ సమాఖ్యకు ప్రముఖ న్యాయవాది మాతకుమిల్లి సుందరరావుని అధ్యక్షునిగా ఎన్నుకొన్నారు. రిటైర్డ్ డిప్యూటీ లేబర్ కమీషనర్ జి. కామేశ్వర రావు ఉపాధ్యక్షులు కాగా ఇంత వరకు నెల్లూరులో వినియోగ దార్ల సంఘాన్ని నడుపుతున్న ఎస్.వి. కృష్ణయ్య ప్రధాన కార్యదర్శి.

## సిటిజెన్స్ క్లబ్ వుచిత వైద్య శిబిరం

నెల్లూరు 'సిటి జన్స్ క్లబ్' కోవూరు మండలం పాటూరు గ్రామంలో ఒక వుచిత వైద్య శిబిరాన్ని 6 తేది నిర్వహించింది. 500 మందికి పైగా గ్రామస్తులకు వైద్య పరీక్షలు జరిపి ఆరు వేల రూపాయల పైగా విలువ చేసే మందులను పంచి పెట్టారు. శిబిరంలో ఇండియన్ మెడికల్ అసోసియేషన్ కార్యదర్శి డాక్టర్ జయచంద్రలతో పాటు డాక్టర్లు సత్యనాథ్, ప్రేమచంద్, రత్న పాల్గొన్నారు. గ్రామ ప్రముఖుడు సామంతు రఘురామ రెడ్డి శిబిరానికి ముఖ్య అతిథిగా విచ్చేశారు. విమల్ రెడ్డి, హాక్ సౌరాం ఉదయ భాస్కర రావు, రఘురాం, సంస్థ అధ్యక్షుడు టి. వెంకటేశ్వర్లు సేవా దృక్పథంతో శ్రమించారని శిబిరాన్ని జయప్రద మొందించారు.

జమీన్‌రైతు
సంవత్సర చందా రు 100/-
6 నెలలకు - రు. 50/-
విడిప్రతి - రు. 2.00



14వ తేది హైదరాబాదులో ముఖ్యమంత్రి [illegible] కలిసి [illegible] కలిగిరి మండలం రైతులు. మాజీ మండలాధ్యక్షుడు రామిరెడ్డి, నెల్లూరు ఎమ్మెల్యే శేఖరరెడ్డి, కావలి ఎమ్మెల్యే కలికి [illegible]రెడ్డి ( పాపం పొట్టివారు కదా కన్పడటం లేదు లెండి )

## సెక్యూరిటి

( 1 పేజి తరువాయి )

కలిశారనడానికి తిరుగులేని నిదర్శనంగా పనికి వస్తుంది. అంత కంటె అధికంగా, ఈ సెక్యూరిటీ పాస్ పైన " బ్యాగేజ్ నాట్ చెక్డ్ " అని ముద్ర వేసి వుందట. సత్పాల్ మిట్టల్‌తో కలిసి వచ్చే మెహతా బ్యాగేజిని చెక్ చేయకుండానే లోపలకు పంపమని సెక్యూరిటీ సిబ్బందిని ప్రధాన మంత్రి అంతరంగిక సిబ్బంది ఆదేశించడం వల్లనే వారు మెహతా తెచ్చిన సూట్‌కేస్‌ను చెక్ చేయకుండా లోపలకు అనుమతించి. ఆ విషయం సెక్యూరిటీ పాస్ పై వ్రాశారని ఒక వదంతి. ఏ కారణం లేకుండా మెహతా సూట్‌కేసును చెక్ చేయవద్దని ఆదేశించలేదు కదా! ఆ ఆదేశం రాకుంటె పరీక్ష చేయకుండా సెక్యూరిటీ సిబ్బంది వదలి వుండదు.

ఈ సెక్యూరిటీ పాస్ హర్షద్ మెహతా దగ్గర వున్న విషయం నిజమైతే ప్రధాన మంత్రి ఈ విష వలయంలో చిక్కుక పోయినట్లే లెక్క. తాను మెహతాను కలవ లేదని కాని, అతడు తన దగ్గరకు సూట్‌కేసు తేలేదని కాని చెప్పలేదు. సూట్‌కేసులో ఏముందో తనకు తెలియదని, అందులోని డబ్బు తనకు చెందలేదని చెప్పినా - మెహతాను కలిసి ఇంతకాలం ఆ విషయంలో మౌనం వహించినందుకు జాతికి సంజాయిషీ చెప్పవలసి వస్తుంది. హర్షద్ మెహతా వంటి ఘరానా నేరస్తుడిని తాను కలిసి మాట్లాడిన మాట నిజమై, అది దాచి పెట్టి వుంటె మాత్రం పివి ప్రజల దృష్టిలో దోషిగా మిగిలి పోతారు.

తన సిబ్బంది ఇచ్చిన సెక్యూరిటీ పాస్ తన కొంప ముంచే పరిస్థితి ఏర్పడడం నిజంగా పివి చేసుకున్న పాపమేననాలి!

## కోట్లగాలం

( మొదటి పేజి తరువాయి )

మిగిలింది ఉత్తర్ ప్రదేశ్ నాయకుడు ఎన్‌డి తివారి. ఆయన పార్లమెంటు సభ్యుడు కాడు; పై పెచ్చు ఎన్నికలలో ఓడి పోయాడు. వీరు ముగ్గురు మినహా పార్టీలో అంతటి సీనియర్లు, అర్హత కల్గిన వారు మరెవ్వరూ లేరు. మాధవరావు సింధియా, రాజేష్ పైలట్ల వంటి వారు జూనియర్ల క్రిందే లెక్క.

ఈ పరిస్థితులలో తనను మించిన వారు లేరన్న ఆలోచనతో కోట్ల బయట వరి మద్దతు సమీకరణకు ప్రయత్నిస్తున్నారు. పివి భవిష్యత్ ఏమిటో ఒక వారంలోగా తెలిపోతుంది. అప్పటికి ఎవరికి ఎవరో!

## కీచులాట

( 2 పేజి తరువాయి )

విషయాలలో వైఎస్ మాటకు ముఖ్యమంత్రి తలవూపడం ఆ శిబిరంలో ఆనందం కల్గించింది. మంత్రిత్వాలు రాబోతున్నాయని వారు ఆనంద పడిపోతున్నారు. అయితే వైఎస్ కేవలం ఐదు పేర్లతో జాబితా ఇవ్వడం చాలా మందికి నచ్చలేదు. అటువంటి వారందరినీ బుజ్జగిస్తున్నారు వైఎస్ ఇప్పుడు.

వైఎస్‌తోపాటు చెన్నారెడ్డి వర్గీయులలో కూడా కొందరికి పదవి యోగం కల్పించాలన్నది కోట్లవారి అభిమతం.





Edited, Printed and Published by N.Dolendra Prasad at Zamin Ryot Press, Nellore. OFFSET Printing at Nayagara Paper Products (India) Limited.